

చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౨౭

సంపుటము ౪ ప్రభవ సంవత్సరము మార్గశిరమాసము సంఖ్య ౧౨

# సేవాంజలి

వేంకట పార్వతీశ్వర కవులు

ప్రత్యయప్రకృతి లోపంబైన శబ్దవి - న్యాసమే నీయుపన్యాస మెల్ల ?
ఆదిమధ్యాంతశూన్యంబైన ఘటనాను - బంధమే నీసుప్రబంధ మెల్ల ?
తానమానబహిర్గతంబైన స్వరసన్ని - ధానమే నీభవ్యగాన మెల్ల ?
సగుణనిర్గుణవిశిష్టంబైన సత్క్రియా - చరణమే నీకళావరణ మెల్ల ?
అగు నని పురస్కరించుటే యనుచితంబొ - కాదని తిరస్కరించుటే కాపథంబొ
తెలియకున్నది నను బ్రబోధింపు మయ్య - సచ్చిదానందలీలా ప్రసన్నమూర్తి!

సీ. నాథ! నీవాక్ప్రసూనములలో నెందుండి - తేనియ లూరునో కానరాదు
కాంత! నీదృక్తారకములలో నెందుండి - మెఱపులు మెఱయునో యెఱుఁగరాదు
రమణ! నీభావానిలములలో నెందుండి - వలపులు నిండునో తెలియరాదు
దేవ! నీహాసచంద్రికలలో నెందుండి - యమృతంబు గురియునో యరయరాదు
చెవియుఁ, గన్ను, ముక్కు, జిహ్వయు మా కిచ్చి- దేహ మిచ్చి కొంత తెలివి యిచ్చి
కొంత దాఁచుకొనుట కోరికయా నీకు ? - పావనస్వభావ! దేవదేవ!

సీ. మొగ్గపువ్వులకును ముందిరేకుకప్పల - పిందెకు బిరుసాకు పీట యేల
మించుఁదీగకు నీలమేఘంపుఁదెర యేల - చుక్కకుఁ జీఁకటి ప్రక్క యేల
మురిపెంపుఁబసనకు ముండ్లకాపున యేల - చినుకుపూసకు నాలి చిక్కు యేల
చిగురాకుఁగొమ్మకు జీర్ణవల్కల మేల - పరమాణువున కస్థి భవన మేల
చెక్కు చెదరకుండఁ జెన్ను మాయక యుండ - మృదుపదార్థములకు మేలు గూర్చి
నిలువరించుకొనుట నీస్వభావమటయ్య - పావనప్రభావ! దేవదేవ!

సీ. చిగురుటాకులఁ జూచి చిన్నివన్నెలఁ జూచి - పూవుగుత్తులఁ జూచి తావిఁ జూచి
కోరపండులఁ జూచి తీరుతీయముఁ జూచి - చిలుకబోదలఁ జూచి చెలువుఁ జూచి
చుక్కపేరులఁ జూచి సొంపుబెంపులఁ జూచి - చందమామను జూచి సౌరుఁ జూచి
చలువకాల్వలఁ జూచి కలకలంబులఁ జూచి - కొండకోనలఁ జూచి కొమరుఁ జూచి
యొడలు పులకింప నానందపడుట యేలొ? - యెడఁద గంపింపఁ జడిముడిపడుట యేలొ?
తెలిసితెలియని నను బ్రబోధింపు మయ్య - సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

సీ. కన్నుండి గ్రుడ్డినై కల్యాణమయమైన - నీమూర్తి దర్శింప నేరనైతి
చెవి యుండి చెవిటినై జీవమోహనమైన - నీగాన మాలింప నేరనైతి
తను వుండి జడుఁడనై యనువర్తనంబైన - నీసన్నిధిని జేర నేరనైతి
మతి యుండి విమతినై యతిమనోహరమైన - నీతత్త్వ మూహింప నేరనైతి
పాణిపంకజమునఁ బరమార్థ ముండియుఁ - గోరి యనుభవింప నేరనైతి
ఇంటిదీప మిట్టు లిరులు గ్రమ్ముట యేమొ - తెలిసి తీర్చుమయ్య! దేవదేవ!

సీ. తెలిసి కన్నులు మూసి పులకరించు నొకండు - తెలియక తలతిక్కఁ దిరుగు నొకఁడు
తెలిసియుఁ దెలియక కలవరించు నొకండు - తెలివిలో మఱపునఁ దేలు నొకఁడు
తెలిసియుఁ దెలియని ట్లలమటించు నొకండు - తెలియక తెలిసిన ట్లలరు నొకఁడు
తెలిసిన దనువారిఁ దిట్టిపోయు నొకండు - తెలియలే దనువారిఁ దేర్చు నొకఁడు
అధిప! నీసృష్టి బహుభంగు లైనయట్లె - యనుభవంబులు భిన్నంబు లగుచు నుండె
ఏది త్యజియించి యేది గ్రహింతు మయ్య! - సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

ఉ. చిన్నిమెఱుంగుదీవియలఁ జెల్వము, శైలములన్ మహత్త్వమున్,
వెన్నెలలం బ్రశాంతమును, వేణికలన్ మధురామృతత్వమున్,
మన్నుల సుస్థిరత్వము, విమానపథంబులఁ బ్రాభవత్వమున్
గన్నులఁ బెట్టియుం దెరలు గట్టిన దేమిటి కీశ్వరేశ్వరా!

సీ. అఖిలజీవనపాత్ర మైననీసత్కృపా - వారి నాకన్నీరు చేరనిమ్ము!
అంతర్బహిర్వ్యాప్త మైననీప్రణయవా - యువున నానిట్టూర్పు నొలయనిమ్ము!
అమృతమోహనకోశ మైననీసంగీత - కళ నావచోలీలఁ గలియనిమ్ము!
ఆనందపరిపూర్ణ మైననీసౌభాగ్య - నగరి నాతనువల్లి సొగయనిమ్ము!
నిన్ను దర్శించి, నీదుసన్నిధిని జేరి - నిన్ననుకరించి, నీమూర్తినే స్మరించి
యాడి పాడఁగనిమ్ము నా కన్య మేల? - సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి.

---

# గిజిగాఁడు

జి. జాహ్నవగారు

జిలుఁగుఁబంగరురంగులం గులుకు మేల్చిన్నారిపూగుత్తిసొ
మ్ములు గీలించిన తుమ్మకొమ్మలకు నీవు న్నీనతీరత్న మూ
యెలగీము దగిలించి రేఁబవలు హాయిం దూఁగరా! గాడ్పుబి
డ్డలు మీ కూడిగ మాచరింప గిజిగాఁడా! నీకు దీర్ఘాయువౌ.

ఉ. తేలిక గడ్డిపోఁచలను దెచ్చి రచించెద నీవు తూఁగుటు
య్యేలగృహంబు, మానవుల కేరికి సాధ్యము గాదు, దానిలో
జాలరు లందులో వలపుశయ్యలు నంతిపురంబు లొప్పఁగా
మేలు బళీ! పులుఁగుటెకిమీఁడవురా గిజిగానిసీడజా!

చ. కులుకుఁబసిండినిగ్గులదుకూలములన్ ధరియించి ముద్దుబి
డ్డలనుఁ బోలంతి నీపొదిగిటన్ నిదురింపఁగఁ గన్నెగాలు లూ
యెలనదనంబు నూఁచ, భయమింత యెఱుంగక కన్నుమూయు నీ
యలఘుసుఖంబు మాకుఁ గలదా? గిజిగా! యెకిమీని కున్నదా?

గీ. అందమున నీకు నీడగు నందగాఁడు-గృహవినిర్మాణమున నిన్ను గెలుచువాఁడు
వైభవంబునఁ బోల దేవతలతేఁడు-లేఁడురా! గిజిగా మొనగాఁడ వోయి!

ఉ. నీగిజిగాన్ని నామకము నీతెలివిం బ్రకటించుగూడు నీ
మైఁ గల సోయగం బవని మానవకోటికి ముద్దు సేయు నో
యీ! గిజిగాఁడ! భీతిలకు మీవు ధరాతలి నున్న బిట్టుగా
వాగెడు నాస్తికుల్ తలలు వంతు రనంతుని చెంత ఖిన్నులై.

---

# రవీంద్రనాథ ఠాకూరుగారి గోరా

[శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల భాషాంతరీకరణము]

పారనంది జగన్నాథస్వామిగారు, యం. ఏ., యల్. టి.

బంగాళీ సారస్వతమునుండి నవలలూ, నాటకాలూ తర్జుమా చేసి ఆంధ్ర సారస్వత సంపదను వృద్ధిచేయుటకు ఈ యుగంలో చాలా ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి. భాషాంతరీకరణము స్వతంత్రకల్పనకంటె కూడా ఎక్కువకష్టమని సద్విమర్శకులు చెప్పుతుంటారు. ఎందుకంటె రెండుభాషలతోనూ చక్కనిపరిచయము ఉన్నప్పుడే గాని ఆపని సరసముగా నెరవేరదు. మూలభాషలో ఉండవలసిన పరిచయము దానిఅతీరజ్ఞానముకంటె చాలా ఎక్కువ కాదని అనుకొంటూ తర్జుమాలు ప్రారంభించేవారికి ఈసూత్రము బాగా నచ్చచెప్పవలసి యున్నది. భాష చదవ గలిగినంతమాత్రాన, నిఘంటువుల సాహాయ్యమున్నంతమాత్రాన, వాక్యాలలో ఉన్న పదాలు తెలిసినట్లున్నంతమాత్రాన, భాషాంతరీకరణ యోగ్యత కలుగదు. భాషయొక్క జీవమంతా మాటలలోనే ఉండదు. మాటలు ఆయాసందర్భాలలో స్ఫురింపజేసే ధ్వనివంటి సూక్ష్మార్థములపై కల్పనానైపుణ్యము ఎంతఉంటుందో, అంతకు తక్కువ కాబడి ప్రత్యయములలోనూ కారకములలోనూ ఉంటుంది. ఈ భాషాశక్తి ఆభాషామతల్లి పుత్రుల కున్నట్లు అన్యుల కుండడము సంభవము కాదు. పంద్రెండుపద్నాలుగు సంవత్సరాలు ఏకదీక్షతో అభ్యసించిన బి. ఏ. లకు, యం. ఏ. లకు కూడా ఆంగ్ల భాషామర్మములు చక్కగా కొన్నచోట్ల పట్టుబడకున్నవని సర్వాంగీకారము గదా. అట్టి సందర్భంలో ఆంధ్ర దేశములోనే ఉంటూ, ఏలాగో అక్షరాలు నేర్చుకొని, నిఘంటువులు చేర్చుకొని బంగాళీభాషను స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించుట సాహసము కాదా. బంగాళీభాష సంస్కృతభూయిష్ఠము; సంస్కృతపదాలు మనకు స్వాధీనములే-అన్న ధైర్యము ఈసాహసానికి కొంత ప్రోద్బలక మవుతూ ఉంటుంది కాబోలు. కాని దీనిలో ఒక భ్రమ ఉన్నది. సంస్కృతపదాలకు సంస్కృతములో నానార్థాలు ఉండగా దేశభాషలలో ఏ ఒకటి రెండు అర్థాలో స్ఫురిస్తవి. ఒక్క సంస్కృతమాటే తెనుగులో ఒకలాగు బంగాళీలో ఒకలాగు స్ఫురించడము తటస్థిస్తుంది. భాషాంతరీకారులు ఈభేదమును గ్రహించకపోతే, చదువరులకు కలిగే బాధ ఇంతంత కాదు.

ఈచిక్కులు రవీంద్రనాథఠాకూరుగారి గ్రంథాలవిషయమై అన్ని బంగాళీగ్రంథాలకంటె ఎక్కువ తీవ్రముగా ఉంటవి. ఠాకూ

రుగారు వ్యావహారికభాషను చాలా విచ్చలవిడిగాను చాలా ఎక్కువగాను ఉపయోగిస్తారు. (దేశ్యపదాలను వాడుటలో అతనికి గల నిపుణత ధైర్యములను మన గ్రాంథికవాదులు ఒంటబట్టించుకొంటే చాలా సరసముగా ఉండును.) ఇదికాక పాతమాటలను కొత్తఅర్థకళలలో ఉపయోగించే కవిధర్మం అతనిసొమ్ము. ఆయనకల్పించే మాటలకు లెక్కలేదు. పదముల నిర్వచనములో ఎంత చిక్కు ఉందో అంతకు వెయ్యిరెట్లు అతని భావప్రకటనలో గల నూతనత. అతనిహాపకాలు అసాధారణములు, సాధారణానుభవమునకు అతీతములు. ఈచిక్కులు అసలు బంగాళీలనే బాధిస్తవనిన్నీ, అందరు బంగాళీలు అతనిగ్రంథాలను చదివి ఆనందించకపోవడానికి ఇదే ముఖ్యహేతువనిన్నీ బంగాళీలే చెప్పుతున్నారు. అట్టి ఠాకూరుగారి గ్రంథాన్ని భాషాంతరీకరించడానికి పూనుకొనేవారికి గల కష్టాలు ఇన్నీ అన్నీ కావు. అట్టి భాషాంతరీకారులకు అవశ్యకమైన గుణసామగ్రి ఎట్టిదో వేరే ఇక వివరించ నక్కరలేదు.

బ్రహ్మశ్రీ వేంకటపార్వతీశ్వరకవులు ఆంధ్రలోకములో సారస్వతాభివృద్ధివిషయమై సంపాదించిన పేరుప్రతిష్ఠలు వారు చేసిన గోరా భాషాంతరీకరణము గురించి వ్రాయబూనుకొన్న నన్ను బెదరకొట్టుతున్నవి. వారు సుప్రసిద్ధకవులు; గొప్ప పండితవర్యులు. అన్నివిధాల పూజనీయులు. వారికి నా అవ్యాజమైన హృదయపూర్వక సాష్టాంగ నమస్కృతులు. అయినా ఠాకూరుగారి గ్రంథానికి జరిగిన అన్యాయము దృష్టికి వచ్చినప్పుడు ధైర్యము బూని ధర్మబుద్ధితో ఆ అన్యాయమును లోకమునకు వెల్లడిచేయవలెననే కర్తవ్యతాజ్ఞానమే ఈ నా సాహసానికి మూలము. వీరితర్జుమా పూర్తి గాకముందే, మొదటి సంపుటము అచ్చునుంచి రాగానే, మద్రాసు విశ్వవిద్యాలయమువారు వారికి అనిర్వచనీయమైన ఉత్సాహమును కలుగజేశారు. ఆ సంపుటాన్నే పఠనీయగ్రంథముగా నిర్ణయించి కవులకు బాగా డబ్బు ఇప్పించారు. అప్పుడు వారి తర్జుమాలో కొన్నిపుటలు చదివి చాలా విసుగుకొన్నాను. సామాన్యులు భాషాప్రౌఢిమ అని మెచ్చుకొనే మాటల గడబిడ నాకు నచ్చలేదు. ఇంగ్లీషు తర్జుమా చదివినప్పుడు ఎంత ఆనందించానో, అంతకు తక్కువకాని విచారము నేసింది గ్రంథముయొక్క శైలి చూడగానే. అప్పుడు నా తగాయిదా అంతా భావప్రకటన సుష్ఠుగా జరిగించే శైలిలో గ్రంథము లేదని మాత్రమే: అప్పడే ఈ వ్యాసాన్ని వ్రాసి ఉంటే భాషాక్లిష్టతనే చూపించి భాషను తేలికచేయమని ప్రార్థించి యుందును.

కాని ఈమధ్య బంగాళీవచ్చిన నాస్నేహితులొకరు మూలము ఎట్టిభాషలో ఉన్నదో వెల్లడిచేసి తెలుగుగోరాయొక్క శైలి శయ్యలతో సరిపోల్చి మూలానికి తర్జుమా ఎంత దూరంగా ఉందో విశదపరచారు. నాకు బంగాళీభాష రాదు. ఏదో తంటాలుపడి కూడపలుక్కొని మాటలు చదవగలిగినా భావ అర్థం కాదు. కాబట్టి ఈక్రింద నేను ఉదాహ

రించే మూలవాక్యాలకు నేను నాస్నేహితుని పైనిన్నీ, ఇంగ్లీషు తర్జుమాపైనిన్నీ ఆధారపడుతున్నాను. అంతేకాదు: ఈ వ్యాసానికి ముఖ్యమైన ఈ దిగువ అంశములన్నీ వారు కష్టపడి ఓపికతో చేసిన శోధనాఫలితములే. ఇక్కడ పొందికచేసి వివరించడమే నేను చేసిన పని. వారైనా గ్రంథము నంతా విమర్శించి ఉండలేదు. అక్కడక్కడ యాదృచ్ఛికముగా ఏవో రెండుమూడుస్థలాలు చూడగా బయలుపడ్డవాటిలో కొన్నిటిని మాత్రమే ఇక్కడ ఇప్పుడు పొందుపరుస్తున్నాను. నా ప్రయత్నం ఏమిటంటే మనభాషాంతరీకారులకు బంగాళీ భాష రాదనిన్నీ, ఆ రాకపోవడమువల్ల తర్జుమాలో చాలా పెద్దపెద్ద తప్పులు ఉన్నవనిన్నీ రుజువుచేయుటే. వారు బంగాళీ చదవ గలిగియుండవచ్చు. మీద నుపపాదించినట్లు అట్టి జ్ఞానము చాలక పొరపాటులకు తావు ఇచ్చింది. ఎట్లంటే, చూడండి:

(1) బంగాళీలో "భారము నొక్కుచుండెను" అని ఉంటే, దానికి తర్జుమా, తెలుగు 145-పుట, ఆఖరి వాక్యము, "ఒక భావము ముద్రింపబడియెను"అని ఉంది. ఎట్టితప్పో చూడండి. ఏలాగు ఇది సిద్ధమయిందో నిరూపిస్తే నావాదన చదువరులకు నచ్చుతుందని చెప్పతున్నాను. బంగాళీలో 'వ' 'ర' అనే అక్షరాలకు భేదము చాలా తక్కువ. అందుచేత 'భార' అని మూలంలో ఉంటే 'భావ' అని చదివారు. "భావము నొక్కుచున్నది" అంటే చక్కగా ఉండనందున 'ఛాపా' అన్న బంగాళీమాటకు "నొక్కుట" అనే అర్థం తీసుకోక, "అచ్చు ఆఫీసుపని" అన్నదానినుండి వచ్చిన "ముద్రింపబడియెను" అన్న అపార్థాన్ని స్వీకరించారు. నొక్కడంవల్ల అచ్చవుతుంది గనుక బంగాళీలో అచ్చువేయడానికి కూడా "ఛాపా" అంటారు.

(2) తెలుగు 146-పుట, 1-పేరా, 3-వాక్యము: "వినయుడు బ్రాహ్మవివాహము చేసికొనుటకు లుబ్ధుడైయుండెనని గోరా యనుమానించి యామిథ్యాసంశయమునకు శశిముఖవివాహమును జామీనుగా జేసి నిశ్చింతుడై యుండెను." వాక్యము చెడ్డది; అన్వయము తప్పు; అర్థమూ కాదు; గోరా వినయుల శీలము మారిపోయింది. సరియైన తర్జుమా ఈవిధంగా ఉండాలి: "తాను బ్రాహ్మవివాహము చేసికొనుటకు లుబ్ధుడై యున్నట్లు గోరా యనుమానించుచున్నాడని వినయుడు పోల్చి, వాని మిథ్యాసందేహముదగ్గిర శశిముఖీవివాహమును చిరంతనపు జామీను స్వరూపముగా ఉంచి తనను విముక్తునిగ జేసుకొనెను."బంగాళీవాక్యములో వినయుడు కర్త, గోరా కాదు. అది భాషాంతరీకారులు పోల్చలేకపోయారు.

(3) 148, ఆఖరివాక్యము:

"గోరా మతమునే విశ్వసింపవలయునను బలవంతము నాకు లేదు." దీని మూలానికి సరియైనతర్జుమా: "గోరాలాగు నాకు నమ్మకం మీద పట్టుదలలేదు." బంగాళీలో "మత"అని ఉంటే దానికి "మతము"అని అర్థంచేసుకోవడమువల్ల వచ్చిన ముప్పు ఇది. "మత"=లాగు

(4) 166, పంక్తి 8:

"మహి—నీ విప్లవకు సరియే యంటివి. మఱి యెప్పుడైన నడ్డము చెప్పదావు.

"గోరా—నే నెప్పుడును నూరక యడ్డము చెప్పను—విరోధించి—"

అని ఉంది. దీనిమూలానికి సరియైన తెలుగు చూడండి:

"మహి—నీ విప్లవకు అంగీకరించుచున్నావు; కాని (నీ పుణ్యముంటుంది) ముందెప్పుడూ మాత్రం మరి యేక్రొత్త యాటంకమును లేవదియ్యకుము సుమా.

"గోరా.—నా అడ్డుకాదు, నా కోరికయే ఈ చిక్కుకు కారణము."

ఎంత ఎక్కువ తక్కువ ఉందో చూడండి.

(5) 208-పుట, ఆఖరివాక్యం:

" 'డ్రైడన్' కవిచే ...రచింపబడిన 'సంగీతశక్తి' అను నాటకమును..." అని ఉంది. ఇది నాటకము కాదు, పద్యకావ్యము. బంగాళీలో ఏ మాటవల్ల ఈ పొరపాటు వచ్చిందో బోధపడలేదు. ఇంగ్లీషుతర్జుమాలో "in a dramatic style" అని ఉన్నదానివల్ల సంక్రమించిన దోషమై యుండాలి. బంగాళీ నుంచే కాకుండా ఇంగ్లీషు తర్జుమానుండి కూడా తెనిగించేరని ఇది నిదర్శనమా!

(6) 210-పుట, మొదటివాక్యము:

"ఆమె యప్రసన్నత ... వినయునకు లక్ష్యమగుచుండెను." అని ఉన్నది. మూలానికి సరియైన తెలుగు: "ఆమె యప్రసన్నత వినయుని గురిగా జేసుకొనెను." ఎంతమార్పు!

(7) 214-పుట, 2-పంక్తి:

ఆవాక్యమంతా చెడిపోయింది. గ్రంథ సంకోచముకొరకు ముఖ్యభాగాలనే ఉదాహరిస్తాను:

తర్జుమాలో ఉన్నది:

1. నాకింతవయస్సు వచ్చినను పుస్తకజ్ఞానమే కాని యనుభవజ్ఞానము కలుగలేదు.

2. నా మానసము ముద్రణాలయము వంటిది.

3. నీవు బాగుగా మాటలాడుటకు ప్రయత్నింపుము.

మూలానికి సరియైన తెలుగు:

1. నాకున్న వేళనంతా చదువులలోనే గడుపుచుంటిని కాబట్టి-

2. నా మనస్సు అచ్చువేసిన గ్రంథము వంటిది.

3. అంత చక్కగా మాటలాడుటకు ప్రయత్నింపకుమీ.

వాక్యమంతా ఈలాగే ఉంటుంది.

(8) పుట 212, దిగువనుంచి 3-వ పంక్తి:

తర్జుమా: "ఏ యుపాయమును దోచక కేవలమును వినయు డామె కధీనుడై యుండెను." సరియైనది: "తనకు అధీనమైనయుపాయమేదియును గనబడలేదు." ఎంతతప్పు? లలిత శీలము చెడగొట్టినట్లుకాదా?

(9) కీలము పాడైన మరొక స్థలము చూడండి: పుట 320, ఆఖరివాక్యము: "సంసార మాతని కంతభారము కాకుండెను." సరియైనది: "ఇకముందు సంసారము అతని దృష్టిని నాకర్షింపలేదు."

(10) పుట 278, పంక్తి 5-7: "ఇంటి తలుపులు" అని ఉంది. అవి గది తలుపులు. 'ఘోర్' అంటే గదికాని ఇల్లుకాదు. "భర్తృ దక్క నితరులకు తెలియదు". దీనికి సరియైనది: "భర్త దక్క నితర వస్తువు లన్నియు పెట్టెలో భద్రముగా నుంచబడును". "ఆమెయందు భర్తకైనను స్వాతంత్ర్యము లేదు." ఇది తప్పు. దీనికి సరియైనది: "అతని భార్యాయాజమాన్యములో నతనికిగూడ నతడుకోరునంత స్వాతంత్ర్యము లేదు."

(11) పుట 313, మధ్యపేరా: "అకారణముగా బాధ్యత నేల వదలుకొనవలయును? సువరితను వదలుకొనుట నాకొక గొప్ప పని కాదు. కాని సమాజపు కలవంపులకు సహింపజాలను." బంగాళీలో on principle 'అన్ ప్రిన్సిపిల్' అని ఉంటే, దానికి "అకారణముగా" అని తెలుగు చేశారు. ఇది తప్పుకాదా? సరియైన బంగాళీ దొరకక అస్వతంత్రకవి ఠాకూరు ఇంగ్లీషుమాటనే వేసేశారు. 'బాధ్యత' కాదు, 'హక్కు'. ఎంత మారిందో! ఆఖరి వాక్యం ఈలాగు ఉండాలి: "బ్రహ్మసమాజమునకు నాచర్యవల్ల తలవంపులు వస్తే సహించలేను."

(12) పుట 308, ఆరంభము:

"వర:—ఇన్నాళ్లకు దరువాత మరల సంగీకారమున నేమో॰ నాకు బోధపడుటలేదు. దానికి బోధించుట నాచేతగాదు. లోపల నొకలాగు, పై కొకలాగు!"

దీనిమూలానికి సరియైన తెలుగు ఇది: "వర—బోధపడలేదూ! ఇన్నాళ్ల తరువాత ఒప్పుకున్నారా? ఆ పిల్లను బోధపరచుకొనుట సులభమైనపని గాదు........."

(13) పుట 302, అధ్యా. 40, పంక్తి 4: "తాను సందతి నాదరించుటకు ప్రయత్నించుచుండెనేగాని వారు తన్నవమానింతు రని సంశయించుటయైన లేదు" అని ఉంది. తప్పు. ఏలాగు ఉండాలంటే: "తాను ఆదరించుటకు ప్రయత్నించుచుండెను గాని వారు మాత్రము ఆమెయెడల తమకుగల అవజ్ఞను ఆమెదగ్గిర దాచి ఉండలేదు."

(14) పుట 592, వాక్యము 16: "అందుచేతనే మీ రేసమాజమునందును స్థానమును గైకొనలేదు" అని ఉంది. ఈలాగు ఉండాలి: "అందుచేతనే మీకు ఏ సంఘములోనూ స్థానం దొరకదు."

(15) పుట 514, అధ్యా. 65, వాక్యం 2:

"గోరా మునుపటికంటెను సాహసముతో మెలంగుచుండెను." అంటే! మూలంలో "ఎక్కువ జాగ్రత్తతో" అని ఉంది.

(16) పుట 494, అధ్యా. 63, వాక్యం 3:

"హరి—ఎక్కడ భుజించితివి? ఇక్కడనే పడియుంటివి." అని ఉంది. తప్పు. ఈలాగు

ఉండాలి: "ఏమిటి తిన్నావు? అంతా (భోజనము) ఇక్కడే, ఇదిగో, అలాగే పడి ఉంది."

మేము చూపినవాటిలో కొన్నిటినే ఇక్కడ నిరూపిస్తున్నాను. పుస్తకము కళ్లు మూసుకొని విప్పి ఎక్కడైనా సరే ఒకపేరా జాగ్రత్తగా పరీక్షిస్తే ఏదో ఒక తప్పైనా లేకుండా తర్జుమా నడవలేదని ఖేదపూర్వకముగా చెప్పుతున్నాను. తర్జుమా బాగున్నా లేకపోయినా ఈ తప్పులుమాత్రము ఉండకూడదని అందరూ నాతో అంగీకరిస్తారనే ధైర్యముతో వీటిని చూపేను. కవులకు బంగాళీభాష రాదు. ఇంగ్లీషుసహాయముతో తర్జుమా చేసిఉంటే ఇన్ని ఇట్టి తప్పులు ఉండకపోవును. వారికి ఇంగ్లీషుకూడా రాదు కాబోలు. నేను చూపిన స్థలములలోగాని, మరెక్కడైనాగాని తర్జుమాయొక్క సాధుతాసాధుతలను పరీక్షించ నిశ్చయించుకొన్నవారు బంగాళీ తెలియదని విచారించ నక్కరలేదు. ఇంగ్లీషుతర్జుమా బంగాళీకి చాలా దగ్గరగా ఉంది. మన తర్జుమాలోని తప్పులు తెలుసుకొనుటకు ఇంగ్లీషు సరిపోతుంది; కాని ఆ తప్పులు ఏలాగు వచ్చినవి అనే కుతూహలము ఉంటే బంగాళీ చూడవలెను. మూలం తాలుకు ఏభాషా రానిదీ తర్జుమాచేయుటకు పూనుకొన్న కవుల సాహసాన్ని ఏలాగు వర్ణించాలో నాకు తెలియదు.

అంతకంటె ఎక్కువ సాహసం మద్రాసు విశ్వవిద్యాలయపు తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ (Board of Studies) వారిది. పుస్తకము పరిశీలించకుండా నియమించారు. భాషాంతరీకారులు సుప్రసిద్ధులు. మూలం ప్రసిద్ధమైనది. గ్రంథంలోనిభాష పటపటమని సమాసాలతోను సంస్కృతముతోను శబ్దముచేస్తూ ఉంది. గ్రామ్యభాష కాదు. ఇవా చూడవలసిన లక్షణాలు! మూలం తారుమారైంది. శీలము పాడైంది. చెప్పదలచుకొన్నదానికి వ్యతిరేకం చెప్పడమైంది. ఈ సంగతులు చూడవద్దూ!

ఇంకొకసంగతి చెప్పి విరమిస్తాను. భాషాంతరీకరణముల ప్రయోజనాలను చక్కగా గమనిస్తే మూలానికి ఉచితమైన భాష ఉపయోగించవలసిన బాధ్యత వ్యక్తమవుతుంది. బంగాళీమూలం చదివే బంగాళీలందరూ ఠాకూరిగారిభాష ఎట్లు దేశ్యమో, ఎట్లు వ్యావహారికమో వర్ణిస్తారు. మనము, ఆంధ్రులము, గ్రాంథిక వ్యావహారిక వాదములతో కాలము గడుపుతూ ఉంటే, ఏవాదమూ పెట్టుకోకుండా బంగాళీలు వ్యావహారికభాషను విచ్చలవిడిగా వాడేస్తున్నారు. అట్టి వ్యావహారిక బంగాళీభాషను తెలుగులోనికి తర్జుమాచేసేటప్పుడు ఈ డాంబికమైన పటపట తెలుగా ఉచితమైనది! ఉచితము మాట అటుంచి, అర్థము స్ఫురించే తెలుగేమో చదివి చూడండి. బంగాళీసంస్కృతాన్ని తెలుగుసంస్కృతముగా చెయ్యబోతే వచ్చే బాధలు కొన్ని; క్రొత్తక్రియలు కల్పించి వ్రాసేవారికి చదివేవారికి అర్థముకాని శైలిని ఉపయోగించడము కొంత: రెండూ కలిసి చదివేవారిని పీడించేటట్లు శైలి ఉంది. ఉదాహరణాలకు స్థలములేక చూపించలేదు.

ఈ విమర్శన వ్రాయుటకు ప్రయోజనము ఒక్కటే. మన కవులు ఠాకూరుగారి బంగాళీగ్రంథాల నన్నిటినీ తర్జుమా చేస్తామని గ్రంథపీఠికలో ప్రతిజ్ఞ చేశారు. చేసి నాలుగేండ్లు గడచినా మరొక గ్రంథము బయలు వెడలనందున నా సలహా నివ్వ ప్రయోజనమే కాబోలు. బంగాళీగ్రంథాల తర్జుమావాంఛ దేశములో ఉన్నప్పుడు, బంగాళీభాష బాగా తెలియనివారికి, వ్యావహారిక భాషాద్వేషము దృఢముగా ఉన్నవారికి నావ్యాసము ప్రయోజనకారి అగును. వారందరూ ఈ వ్యాసాన్ని చిత్తగింతురని నా ప్రార్థన.

---

# భావకవిత్వము

అనంతపంతుల రామలింగస్వామి గారు

రెండుకాకులు గూర్చుండె బండమీఁద
నొం డెగిరిపోయె, నంత నం దొండు మిగిలె,
రెండవది పోయెఁ, బిదప నం దొండు లేదు,
బండమాత్రము పాప మం దుండి పోయె.

*  *  *  *

ఔర! వంధ్యోదరం బంతకంత కధిక
మయ్యె, నందుండి యమృతాఢ్యమైన గాన
మొండు వినఁబడె, నందుండి యుద్భవించెఁ
బ్రత్యుషఃకాంతులను నవ్య వ్యక్తి యొకటి.

*  *  *  *

ఆయనంతపాథోరాశి యనిలవివశ
మై జనించినయల వళియై, తరంగ
మై, మహోత్తుంగకల్లోలమై, తుదఁ దన
తీరమున భంగమై వార్థిరిక్తమయ్యె.

*  *  *  *

ఆమనోజ్ఞ సుమధురసాయంతన సమ
యమున వలపూని, నీళ్లాడి, యస్మదీయ
హృదయతంత్రులు మీటి హాయిన్ రచించి
కాలసర్పకరాళవక్త్రమునఁ గరఁగె.

*  *  *  *

అనిశా కాచగోళాంతరాన స్నిగ్ధ
కమ్రతరనాళదీప్తి కాకళిక మినుకు
మినుకులాడి హార్దదీప్తి నెనసి నిబిడ
తిమిరచేలాంచలమ్ముల నమసిపోయె.

*  *  *  *

అస్మదీయాంతరంగాపరాశ విమల
రాగరేఖావిలాస విభ్రాజితముగఁ
బానరుచుండియుఁ దమమున మునిఁగిపోయె
మినుకు లలరునె తాను లేమిని జగాన.

*  *  *  *

---



# ప్రౌఢవ్యాకరణము కొన్ని సూత్రములు

శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్యులు అయ్యవారలు గారు

శ్రీమాన్ బ. సీతారామాచార్యులవారు భారతాదిగ్రంథపరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణ ప్రయోగముల నేర్చి కూర్చిన 'త్రిలింగలక్షణశేషము', 'ప్రౌఢవ్యాకరణ'మను నామాంతరములుగల బాలవ్యాకరణ శేషమ... గొన్నిలక్షణము లసంభవాది దోషదూషితములుగఁ గాన్పించుచున్నవి. తత్త్వజ్ఞులగు నార్యులు మంచి మనసుతోఁ బరికించి వాని యౌచిత్యమును దెలిపెదరు గాక!

1. "ఒకానొకచో జకారం బుభయంబు నగు. శ్లేషయందు జకార మొక్కటియ యొక యర్థమున దంత్యమును, వేఱొక యర్థమునఁ దాలవ్యము నయ్యెడునని యర్థము. ఉ. అకట పాండురాజయశ మొన్నవైతి. రాఘ. 1-ఆ. 31-ప. (ఇట జకారము భారతార్థము నందు దంత్యము, రామాయణార్థమునందుఁ దాలవ్యము నని యెఱుంగునది.)" సంజ్ఞా. 5.

సూరిగారి యాదిమ సూత్రము వలెనే యాచార్యులవారి యాదిమ సూత్రమును దంత్యతాలవ్య విషయమయ్యు, శ్లేష యను విశేషాంశ ముండుటంబట్టి శ్లేషస్వరూప మిందు క్రింద వివరింపఁబడుచున్నది: 'శ్లిష్ట మిష్ట మనేకార్థ మేకరూపాన్వితం వచః' (కావ్యాదర్శము, 2-ప. 310-శ్లో.) "అథశబ్దార్థగతత్త్వేన ద్వివిధం శ్లేష మేకేనైవ లక్షణేన లక్షయతి శ్లిష్టమితి. అనేకార్థ మభిధయా వృత్త్యా యుగపదనేకార్థ ప్రతిపాదకపదవత్, తథాఏకరూపాన్వితమర్థభేదేన భిన్నత్వేఽపియుగపదుచ్చారణవిషయతామాపన్నైనైకేన స్వరూపేణయుక్తం[1] వచోవాక్యం శ్లిష్టం శ్లేషాలంకారవదిత్యన్వయః." (ప్రేమచంద్రతర్కవాగీశ వ్యాఖ్యా.) పైలక్షణమునుబట్టి 'పాండురాజ'యను నెడ శ్లేష కేభంగము వాటిల్లును, స్థానభేదమువలన నొకపరియే యుచ్చరించుట మానవునకు దుశ్శకముగదా!

---

1. నను శబ్దశ్లేషస్థలే ప్రయత్నాదిభేదాత్ స్ఫుట ఏవశబ్దభేద ఇతిచేత్సత్యం భేదోఽస్తి; తథాఽపి జతుకాష్ఠన్యాయేన శబ్దయో రితరేతరశ్లిష్టత్వే స్ఫుటశబ్దగతస్త్వైక్యవిహారః, అతఏవ శబ్దశ్లేషే భంగపరిహీష్ణుతా." (సాహిత్యరత్నాకరమ్, అర్థాలంకారతరంగమ్) తత్ప్రయత్నభేదమును గమనించియే సూరన, "క. ఒకకథ వినిరొయెదుతతిచే, లోకకథపై దృష్టినిడిన నొకయర్థము దోఁ, పక యుండు-" (పీఠిక, ప. 18-రాఘ. (అని వివరించి యున్నాఁడు. విశేషము అలంకారదర్పణ మను బాలబోధలో వివరింపఁబడును.

సూరనార్యు నాశయమున నిట (రాజ శబ్దము సంబుద్ధియగునపుడు) దాలవ్యమే యనియు, 'పాండురాజితయశస్కుఁడు' ఇత్యాదిస్థలములఁగూడ దైర్ఘ్యహ్రస్వముచేఁదాలవ్యమే యనియుఁ దోఁచుచున్నది. రాజ + ఇతయశస్కుఁడు అనుచోట దంత్యోచ్చారణమే రఘుడి త్వర్థప్రతీతిహేతువయినను, గ్రాచీత్యమగు తాలవ్యోచ్చారణముండినట్లు, "చుస్తాలవ్యేస్వరే కంఠతాలవ్యేఽపిచ తాలుజః, దన్త్యోఽస్యత్ర పదాద్యేఽచిబహులం పూర్వవద్భవేత్' అను కారిక బోధించుచున్నది.

సూర్యనారాయణీయము 17 పుటలలో "మఱికొన్ని తత్సమశబ్దముల తుదనుండు చకారజకారములు ఉకారముతోఁగూడి దన్త్యము లగును" అనుదాని వివరణమున "ఈపై రెండుసూత్రముల క్రింద నుదాహరించినవియు, అట్టివియుఁ దక్కఁ దక్కిన తత్సమశబ్దములలోని చజ లేయచ్చుతోఁ గూడినను తాలవ్యములే యగునని తెలియునది" యని కలదు. అచ్చులు, అచ్చే, అచ్చో, రాజవు, రాజే, రాజు, రాజో-ఇత్యాదులు తాలవ్యములగునా?

2. "నకారం బసాధారణంబు ద్రుతంబు. ప్రత్యయాగమావ్యయాత్మక మయి యుత్వవిశిష్ట మయిన నకారంబు ద్రుతసంజ్ఞకం బని యర్థము. ద్రుత మనఁగా నొల్లనియొక మఱఁగి పోవునది యనుట. సంజ్ఞా. 7-సూ.

ఉండెడిని + అతఁడు. ఇత్యాదుల నిత్వవిశిష్టముగూడ ద్రుతముగావలయు. సూరి దీనిని ద్రుతప్రకృతిక మనదే సంధినిషేధమును గావించియున్నాఁడు. నన్నపార్యాది ప్రాచీనులుగూడ నిత్వవిశిష్టమును ద్రుతప్రకృతిక మనియే ప్రయోగించియున్నారు. ఆచార్యులవారే, "కొన్ని యెడలఁ బ్రామాణికప్రయోగములం ద్రుతంబునకచ్చుపరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి" నను సూత్రమున (సంధి. 3), ఉ. "మ. ఘనచక్రాయుధ నిష్ఠురస్ఫుట గళద్రక్తాస్య సర్వాంగుని, న్ననుభూతాప్రతిమప్రగల్భపరివాదాంతస్థితో ద్విక్రముః"" ఉ. హరి. 6-ఆ అని యుదాహరించి యున్నారు. ద్రుతమే కాకున్న ద్రుతస్వరమునకు లోప మెట్లు? ఈ సూత్రాంతమున" నన్న యభట్టారకుఁడు 'అన్నిష్టనఖనూఁదియున్నదాని' అని ప్రయోగించి, 'లుక్సంశ్లేషా నాఽచి ద్రుతస్య' అని సంశ్లేషము నిషేధించుట ప్రయోగవైరళ్య సూచనార్థంబని యెఱుంగునది" అని కలదు. కాని, 'అను' లోని నువర్ణము ప్రత్యయాగమావ్యయాత్మకము గాక, ధాతుసంబంధి యగుట సంశ్లేషము రాదు. పెన్వాదులఁగాని, అన్న ఇష్టనఖ యని కాని గ్రహించుటయే యుచితము.

3 "ద్విత్వరహితమ్మగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు. ఉ. నను నెఱిఁగె నిను నెఱిఁగె; మొ." ముక్తలక్షణ వివేచనము, సంధి. పుట 95.

ఈసూత్రమునకుఁ గ్రిందను "ప్రథమేతరవిభక్తి..........యందున్న యుకారమునకు సంధి వైకల్పికముగానగు.(బా. 3,సంధి.)"అను సూత్రముచే'ననుఁ జెఱిఁగె'నిత్యాదిస్థలములను రాముఁ + అనఘు నిత్యాదిస్థలములను సంధి

ప్రాప్తించెననియుఁ, దన్నిషేధమే ప్రయోజనమనియు, ద్విత్వరాహిత్యమును గృతద్విత్వవిషయముగఁ గాక సామాన్యముగాఁగూడ గ్రహింపఁదగుననియు, నాంధ్రభాషాభూషణమునందలి, "క. అచ్చుగఁ బైహల్లుండక, యచ్చుండినఁ దద్ద్వితీయ కత్త్వనకారం, బచ్చోఁ బాయక నిల్చును, విచ్చలవిడిఁ బోవు నచ్చు వేఱొకఁ డైనన్." (51); "క. నన్నును నిన్నునుఁ దన్నును, నన్నందుల కునుఁ గినులయందును మునుపై, నున్న నకారపుఁ బొల్లులు, పన్నుగఁ బోఁజూపు నచ్చుపై నున్నయెడన్." (58) అనువాని ఫలితసిద్ధ దేయనియు ననుచున్నారు. కాని, బాలవ్యాకరణపుఁ బ్రకీర్ణకపరిచ్ఛేదమున[1] "జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లే"దను 9-వ సూత్రముచే నీసూత్రమునకుఁ బ్రయోజనమే లేదు. 'రామున్ + అనఘు'నిత్యాదిస్థలముల ద్రుతప్రకృతికమగుట సంధి లేనేలేదు.

సూర్యనారాయణీయమున 130-పుటలోఁ 'జిన్నయసూరి' "ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులయందున్న యుకారమున సంధి వైకల్పిక"మని చెప్పి, 'నన్నడిగె', 'నాకొఱకిచ్చె' మొదలయిన వుదాహరించెను. కాని, కొఱకుఱ్ఱ-కుఱ్ఱ అనువానిలోని ఉకారమువలె నన్నులోని ఉకారము ప్రకృతిసంబంధమైనది కాదు. నాశబ్దమున కాదేశమువచ్చినది నన్ను. దీనిమీఁది విభక్తి 'ను' దీనిమీఁది ఉకారము లోపించినపుడు నన్నున్ అగును. దీనిలోని ఉకారము ప్రకృతిసంబంధమైనదగుటచేతఁ బైసూత్రమిచట వర్తింపదు. అట్లు వర్తించెనేని, రామున్ + అడిగెన్, రాముడిగెన్, అని యేల కాఁగూడదు? కాన ద్వితీయావిభక్తియం దెచటనుండు ఉకారమునకు సంధి వచ్చునో ఇపుడు నిర్ణయింపఁబడుచున్నది. ఈ చెప్పఁబోవు నాలుచోట్లఁ దప్ప ద్వితీయావిభక్తి యందుఁ బ్రకృతి సంబంధమైన ఉకారమునకు సంధి రాదు:

సూ. నీ, నా, తన శబ్దముల ద్వితీయా విభక్తి రూపముల ఉకారమునకును......... సంధి వైకల్పికము.

... ... ... ... ... ... ...

సూ. [2]నిన్ను మొదలగు నాటింటికి ద్విత్వలోపమ్మున సంధి రాదు.........

ఈ రెండవసూత్రమును, నాచార్యులవారి సూత్రమును నేకాభిప్రాయోదితములే. కా

1. అల్లెత్తె, కన్నదరె, నిత్యాదుల 'నుత్తున కచ్చుపరంబగునపుడు సంధియగు'నను సూత్రముచే సంధివచ్చును. అట్లే అల్లు + ఎత్తె, కను + అదరె, నిత్యాది స్థలములనుగూడ సంధివచ్చెను. ఈసంధిని వారించుటకే యీసూత్రమునకుఁ బ్రయోజనము. జడ్డక్కారంబుతో ననఁగా నిపుడు జడ్డక్కారంబయినను గాకున్నను ప్రాథమికదశలో జడ్డక్కారంబగుదానితోనని తెలియునది. అట్టిదానితో సంధి యగునెడల జడ్డకు లోపంబు రాదు. ప్రౌఢవ్యాకరణమునకన్న నీసూత్రమే యతిప్రౌఢముగ నున్నది.

2. బాలురకుఁ గూడఁ దెలియునట్లు లీగ్రంథమును రచించిన బ్రహ్మశ్రీ పల్లాది సూర్యనారాయణశాస్త్రులవారికిఁ గృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడ. నాకుఁగల కొలఁది యభిప్రాయభేదములను బై వివరించునట్లే.

స్త్రిలవారు శ్రేలుపెట్టి సూరిగారి దోషమును గణించుటచే నిట్టి గొంచెము వ్రాయవలసి వచ్చినది.

సూరిగారి శ్లోకమతమున వ్యాప్తియు, శేషాశమతమున నతివ్యాప్తియు నేర్పడినవి. సూరిగారికే యనవేల? 'అనాదిషు విభక్తిషు తోవా' యని సూత్రించిన నన్నయార్యుడు నిందుల కుత్తర వాదియే. సూరి సర్వనామ ప్రకరణమున ప్రక్రియ లేకయే, ద్వి.నిన్నును, నిమ్మును ఇత్యాదు లుదాహరించుటచే నాతని సూత్రములు చాలవనుకొని నన్నయ భట్టీయ మున శాంధ్రీకరణమగుట వంకలి సూత్రము లంబట్టి ప్రక్రియ యొనర్తును.

'న్నమ్మా హ్రస్వ శ్చాదే రమి శసిచ' అంశసో ర్న్నమ్మా ఏతౌ స్తః. ఆదే ర్వర్ణస్య హ్రస్వశ్చస్యాత్. నన్ను, మమ్ము, నిన్ను, నిమ్ము. ఈ వ్యాకరణమున ద్రుతమునకుం బ్రత్యేకవిధి లేమి, 'నను:నిరద్రుతా' యను పదస్వారస్యముచే నన్నున్, మమ్మున్; స్వత్వ ము నన్నును, మమ్మును. ఇట్టియెడ ద్రుతపదిక సంబంధమైన దగు టెట్లు? ఈవిషయము నా చార్యులవారు ప్రౌఢవ్యాకరణమున 'నకారం బసాధారణంబు ద్రుతం' బను సూత్రమున వివ రించియున్నారు. అహోబలుడును, "యద్య ప్యమత ఇత్యనేన 'రాము నళి రాముం దలం చెద' ఇత్యాదా ఉకారస్య సంధిః ప్రాప్తః. తథాఽపి [1]వివక్షితద్విత్రియార్థప్రతీత్యభావ ప్రసంగః స్యాదితి న నివార్యః" అని తెలిపియు న్నాడు. కావున సూరిగారి దోషగుణలు తొలగినవి.

స్థాలీపులాకన్యాయమున 3 సూత్రము లుదాహరించితిని. ఇంకను గొన్ని యిట్టివి కలవు.



1. 'వివక్షితద్విత్యర్థ ప్రతీత్యభావ ప్రసంగః స్యా' త్తని ప్రయుక్తత నెఱుంగుటకు గారణము 'ద్రుత ప్రకృతికముపకు సంధి లే'దను సర్వవిద్యుత్సూత్రము లేకుండుటయే. పాఠకులు 'అనతి'అనునంశచే సంధి ప్రాప్తి యను వ్యాఖ్యాత యభి ప్రాయమును గమనించునది.

# భారతీ సంవేశము

తుంగా వేంకటరామయ్య గారు

ఆందగించెదు పరువంపు టాంధ్రవనుల
 కేలఁ బిల్చెదు రాగమ్ము లాలపింపఁ
గోలుపోయిన వాంఛల జేలవడిన
రిక్తహృదయుండ నను బల్కరింపకమ్మ.

ఏల పల్కెదు? కోర్కులు గోలుపోయి
డీలు పడుటేమి? దాఁచిన పూల వీణె
తంత్రులం దిద్ది పాడినంతనె వసంత
నేఁడు కాఁడె ప్రసన్నుండు నీ విభుండు.

అగును భవదీయవాక్యమ్ము లమృతమయము
లమ్మ! కరుణామయీ! కడు నల్పమతిని
త్రెంపుకొంటిని తంబుర తీవలెల్ల
వాఁపు దిగఁద్రొక్కి తృష్ణాటవులఁ జరించి.

మానుషము గాదు దివ్య మా మంజువీణె
త్రెంపుకొనుటేఁ దెగుటేఁ దెలియదేమొ!
దివ్యగోదావరీ స్రవంతి ప్రశాంత
పులినసీమల నీవెత నిడితి నేను.

కన్నవారలు నను వీడి చన్నవేళ
బంధుగులు ద్రోసిరాజని పంపువేళ
నిలువ నీడయు లేక వినీలగగన
తలము నీధాత్రియుం దలితండ్రులనెను

భావమున గౌతమీతీరవనములందు
వినుచు కన్నీటిధారల విధము నేడు
స్మృతికి వచ్చె; జగన్మాత! స్మృతికి వచ్చె.

.......................................

ఓ జగద్ధాత్రి! ప్రణయసాయుజ్యరాజ్య
సింహపీఠనివాసినీ! చేతు వినతు
లమ్మ నీయాంధ్రలోక మోహనపథాలఁ
గావ్యగీతాల రచియింపఁ గడఁగు మదిని.

కావ్యగీతప్రియుం డగు కాశ్యపేంద్రు
కేళికారామకోకిల కేల భీతి?
అమరభూరుహ కుసుమాశ్రయమ్ము గన్న
భ్రమరపుత్రి, భయమ్మేల? పాడు మోయి!

ఆ మహారాజ హృదయమ్ము నాశ్రయించి
తేలుమోయి జగమ్ముల నేకగతిని!
ఈమహాభిక్షుపాత్రమ్ము నిరువు దీసి
వాన వానలఁ గబళమ్ము నేడు మోయి.

కటికకత్తులఁ బూవుల నరులు చేసి
దురములందునఁ బెండ్లిండ్లు జరుపు మోయి!
ప్రణయవీణకు శౌర్యంపుఁ బదను పెట్టి
వీరగీతాలు హాయిగా వినుపు మోయి!

ఆంధ్రవీరావతంస రక్తాభిషేక
విభవమై క్షాత్ర కాంతుల వెలుఁగుచున్న
వీరపల్నాటి వీథుల వెదలి వెదలి
మేను పుప్పొంగఁ బాడు మమేయగతుల.

కొండవీ డెక్కి వైరిదిక్కుంభికుంభ
పాళిఁ జీల్చిన యాంధ్రసింహాలు మనిన
కోటబురుజులఁ బాడు మీనాటి కేళి
వింద పట నాంధ్రసంతాన విజయగీతి.

గోలకొండదుర్గాలకు వ్రాలు దేని
తెనుఁగుజోదుల బవరంపుఁ దీవరంపుఁ
దేజమును నాంధ్ర భారతీదేవి దివ్య
ఖేలనమ్మును నటఁ దిలకింపఁగలవు.

వ్రాలెడే రాయచూరు దుర్గాలకడకు
నాంధ్రభానుండు రామరాయక్షితీంద్రుఁ
డక్కటా! కాలసుందరి యాస్యసీమఁ
దాండవించెనుఁ గని యొక్కఁడంద వినుము.

శ్రీగిరీంద్ర మణిమయ శేఖరముల
మల్లికాహూప శివమనోమధువుఁ గ్రోలి
సచ్చిదానంద వీథుల జాటు శ్రుతులఁ
దెల్పు భ్రమరిని నేను గాదే కుమార!

వత్స, భవదీయ సౌభాగ్యవశత నచట
మాతృగానమ్ము విని తన్ను మఱచిపోవ
తుంగభద్రా ప్రవాహ తరంగరంగ
భూషితమ్మగు విద్యాపురము గనుము.

ఆంధ్ర సామ్రాజ్యమే రాధయై నటింప
నవతరించిన శ్రీకృష్ణ నాక్రియమునఁ
దాండవించిన నత్కళాతరుణగోప
సుందరీ బృందనాట్యమ్ముఁ జూడఁగలవు.

కదలు మటనుండి సింహవిక్రమపురమ్ము
గందు వట తెన్గుఁగైతల గరువ తనపు
టాటపాటల మరగిన పోటు బంట్ల
వీరగేయమ్ములను గోర్కె దీరునటులు.

కలఁడు తిక్కన నా తొలికాన్పునందు
మన్యముఁడు, యజ్వ, కవియు,నమాత్యవరుఁడు
మనుమసిద్ధి క్షితీంద్రు సామ్రాజ్యమునకు
నతని కథలను బాడి ధన్యతను గనుము.

నేఁడు కదలుము కృష్ణవేణీ తరంగ
శీకరాంచిత సైకత సీమలకును
ఆంధ్రవిష్ణుపురాణమ్ము లాంధ్రనృపుల
వీరకథలును జెప్పెద ధీరఫణితి
కనకదుర్గాంబనై నేనె కవికుమార!

ఆ మహాదేవునంశచే నవతరించి
విశ్వమానవకోటికి వెలుఁగుఁ జూపు
బుద్ధభగవాను లీలావిభూతిఁ జూడు
మాంధ్రనగరస్థ విశ్వవిద్యాలయముల.

అల్లయమరావతిస్థ నాలయములఁ
బరమశివుని పాదాంబుజసరణి నున్న
దివ్యరూపుని వేంకటాద్రి క్షితీంద్రుఁ
గాంచు మాతేఁడె కళలకుఁ గన్నతండ్రి.

గౌతమికిఁ గృష్ణకును మధ్యఁ గల దొకండు
ప్రాచ్యచాళుక్య విష్ణువర్ధనునికోట
ఆమహారాజ తేజమే యాంధ్రమునకు
భానుమండల దీప్తులు ప్రణయవీర!
ఆమహావీరుఁ జూడు మో యాంధ్రపుత్రి!

భూతదయయందు బుద్ధుని బోలు ఘనుని
దానమున బలికర్ణుల దాఁటునతని
శ్రీమహావిష్ణులీలాభిరామమయుని
రాజమణియైన ధర్మాప్పరాయ నృపుని
అతనిచరితంబుఁ బాడి పుణ్యమ్ము గనుము.

(సశేషము)




లక్ష్మీ నారాయణులు

చిత్రకారుడు: శ్రీ వరదా వెంకటరత్నంగారు, రాజమం



'కోనిగ్‌సీ' లేక 'సెంటు బార్థలోమియో' సరస్సు

ఇది జర్మనీదేశములోని బవేరియా రాజ్యములో నున్నది. దీనిపొడవు ౫ మైళ్లు. వెడలుపు ౫౦౦ గజములమొదలు
౧ మైలుకు కొంచెము పైగా ఉండును. లోతు ౬౦౦ అడుగులు. జర్మనిలోని సరస్సులలో నిది
చాల సుందరమైనది. ౬౫౦౦ అడుగుల ఎత్తుగల సున్నపురాతికొండలనడుమ నిది యున్నది.

[ఇ. మెర్కు కంపెనివారివలన నుపలబ్ధము]

# సాహిత్యము - శాస్త్రము

దర్ల నారాయణశాస్త్రి గారు

(పూర్వసంపుటము, ౮-వ సంచిక తరువాయి)

## ౨. జ్యోతిష గ్రంథములు.

వ్యాకరణమునకుఁ దరువాతమాత్రము జ్యోతిషము మహత్త్వము కలది. ఈజ్యోతిష గ్రంథ మెంతో చెప్పుటకు శక్యము కాకున్నది. ప్రస్తుతసమయమున లగధగ్రంథము వేదాంగజ్యోతిషమని ప్రసిద్ధమైయున్నది. వైదికులు దీనిచే పఠించుచున్నారు. పాణిని పేరువలెనే లగధుని పేరు కూడ మహాభారతమున చెప్పఁబడలేదు; అయినప్పటికి నతఁడు మహాభారతమునకంటెఁ బ్రాచీనుఁడనుటకు సందేహము లేదు. రెండవజ్యోతిషగ్రంథకారుఁడు గర్గుఁడు. జ్యోతిషమున గర్గపరాశరుని నామము ప్రసిద్ధముగానున్నది. ఈ గర్గుఁడు సరస్వతీతీరమునఁ దపముచేసి జ్యోతిషశాస్త్రజ్ఞుఁడయ్యెనని వర్ణింపఁబడెను. గర్గునిసంహిత యొక్కటి యిప్పుడు మనకు లభించుచున్నది. ఇది మహాభారతకాలమునఁగూడ నుండియుండెను. గర్గుఁడు మహాభారతకాలమునకన్నఁ బూర్వుఁడని నిశ్చయింపఁబడెను. జ్యోతిషమున గర్గునియొక్క మతాంతరములు మాటిమాటికి వచ్చుచున్నవి. శ్రీకృష్ణునిచరిత్రమునఁగూడ గర్గాచార్యుఁడే జ్యోతిషశాస్త్రజ్ఞుఁడుగా వర్ణింపఁబడియున్నాఁడు. *

---

* అనుశాసనపర్వముయొక్క ౧౮-వ యధ్యాయమున నీశ్లోకమున్నది.

చతుష్షష్ట్యంగ మదదాత్కలాజ్ఞానం మమాద్భుతమ్; సరస్వత్యాస్తటే తుష్టో మనోయజ్ఞేన పాండవ!

ఇందు ౬౪ అంగములుగల కలాజ్ఞానము వర్ణింపఁబడినది. ఈగ్రంథము వర్తమానసమయమునఁ బ్రసిద్ధమైయున్న గర్గసంహితయే యని ౬౪ అంగములయొక్క యుల్లేఖమువల్ల నిశ్చయమగుచున్నది. వృద్ధగర్గసంహితయొక్క ప్రథమాధ్యాయమున ౬౪ అంగము లున్నవని చెప్పి ప్రత్యేకముగా వాటివాటియందలి విషయములుకూడఁ జెప్పఁబడియున్నవి. మహాభారతములో దృష్టమగుచున్న జ్యోతిర్విషయకమైనవన్ని యీసంహితయందివియే [illegible] నిశ్చయమగుచున్నది. మహాభారతములోని యనేకవచనములు ఈగ్రంథమునందలి వాక్యములతో మిళితములై యున్నవి. దీనియందును నక్షత్రములు 'సూర్యాద్యావినిస్సృతాః' చంద్రుఁడు సముద్రమునుండి పుట్టుటయు, దక్షుని శాపమువలన వానికి క్షయవృద్ధులు కలుగుటయు నిందు చెప్పఁబడియుండెను.

రాహువు శిరోమాత్రుఁడనియు నతఁడాకాశమునఁ దిరుగుచుండుననియు నిందుఁ జెప్పఁబడియున్నది. దీనిలో రాహుచారము, గురుచారము, శుక్రచారము మొదలుగాఁగలవి వర్ణింపఁబడినవి. వీటియాధారమున, యుద్ధమందుఁ గాఁబోవు జయాపజయములును, రాజులయొక్క జీవనసంబంధమగు ననేకశుభాశుభఫలములును చెప్పఁబడినవి. అంగారకుని వక్రమునకును, వక్రానువక్రమునకును మిక్కిలి యనర్థపరిణామము చెప్పఁబడియున్నది. మహాభారతమున భీష్మపర్వముయొక్క మొదట వర్ణింపఁబడిన దుశ్చిహ్నములలో నంగారకుని వక్రానువక్రములు దీనియాధారముమీఁద నున్నవి. వాటియొక్క వ్యాఖ్యకూడ నిచ్చట నీయఁబడియున్నది.

అంగారరాశి ప్రతిమం కృత్వా వక్రం భయావహమ్, నక్షత్రమేతి యత్పశ్చా దనువక్రం తదుచ్యతే,

తథావక్రానువక్రే [illegible] హంతి మహీక్షితామ్.

## ౩. నిరుక్తము, ౪. కల్పము, ౫. ఛందము, ౬. శిక్ష.

ఇప్పుడు నిరుక్తమును లేక శబ్దప్రవచనమునుగూర్చి విచారింపవలసియున్నది. యాస్కునియొక్క నిరుక్త మిప్పుడు వేదాంగము పేరునఁ బ్రసిద్ధమైయున్నది. యాస్కుఁడు మహాభారతకాలముకంటెఁ బూర్వుఁడనుట నిర్వివాదము. ఈతని పేరు మహాభారతమున వచ్చియున్నది. ఈతనిశబ్దకోశము (నిఘంటువు) యొక్క నామము (శాంతిపర్వముయొక్క 343 వ యధ్యాయమున) ఉన్నది. ఇప్పుడింక ఛందమునుగూర్చి యోచింపఁగా: ఈయంగమును గావించినవాఁడు పింగళుడు. వైదికు లీతని ఛందశ్శాస్త్రమును బఠించుచున్నారు. కాని యీపింగళుని పేరు మహాభారతమున లేదు. అంతమాత్రమున నతనియొక్క యనుమానము బయలుదేఱ జాలదు; ఈపింగళుని మహాభారతముకన్న బూర్వునిగా నెంచవలయును. ఇప్పుడు పాణినియొక్క శిక్ష ప్రసిద్ధమైయున్నది. కాని వేదములకు శిక్ష భిన్నభిన్నముగా నున్నది. మహాభారతమున (శాం. ప. అ. 342) ఒకశిక్షాప్రణేతయొక్క వర్ణన కలదు. "బాభ్రవ్యవంశ్యుఁడగు గాలవుఁడు క్రమశాస్త్రమునఁ బారంగతుఁడయి శిక్ష, క్రమము, అనెడు రెండువిషయములమీఁదను గ్రంథములను లిఖించెను. ఇప్పుడు మిగిలియున్నది, కల్పము. కల్పమనఁగా వేఱువేఱు వేదములలోని యజ్ఞసంబంధమగు జ్ఞానమును గలిగించునట్టి సూత్రములని యర్థము. ఈకల్పసూత్రములను జేసినవారు అనేకులున్నారు. కాని వారి మాట మహాభారతమునం దగుపడదు. అకటా! సూత్రశబ్దముమాత్రము మహాభారతమునమున్నది. ఈసూత్రశబ్దముచేత శ్రౌతసూత్రములను గ్రహింపవలయునో యని యనుమానము జనించు[illegible]న్నది. శాంతిపర్వముయొక్క 269 వ యధ్యాయమున నీశ్లోకమున్నది—"

అశక్నువంత శ్చరితుం కించిద్ధర్మేషు సూత్రితమ్.

పాణినివిషయమున ననేకసూత్రములయొక్క వర్ణనయున్నది. ఈసూత్రములు వేఱువేఱువిషయములమీఁద నుండియుండును. అట్లుగాక. ఇంతవఱకు వైదికసాహిత్యముయొక్క చర్చ యయ్యెను. మహాభారతమున 'ఉపనిషద్' శబ్దమునకు రహస్యము, బ్రాహ్మవేదము, వేదాంతము, అని యీభిన్నభిన్నములైన సంజ్ఞలు లభించుచున్నవి; అక్కడక్కడ మహోపనిషచ్ఛబ్దముకూడఁ బ్రయోగింపఁబడియున్నది. ద్రోణపర్వములో ౧[illegible]-వ యధ్యాయమున భూరిశ్రవుఁడు తనదేహమును ప్రాయోపవేశనముగావించి, విడిచి పెట్టుటకు విచారమొనర్చియుండెను. ఈయుపనిషత్తునుబట్టి ఓం అను ప్రణవముపై ధ్యానముంచవలసియున్నది.

### ఇతిహాసములు-పురాణములు

ఇంక మనము ఇతిహాసములు పురాణములు వీనిఁ గూర్చి విచారము గావింపవలసియున్నది. వైదికసాహి

---

ఈసంహితయం దున్నవిషయమంతయు నక్షత్రములమీఁదఁ బ్రతిపాదింపఁబడియున్నది. ఇందు రాసులయొక్క చర్చ బొత్తిగా లేదు. కనుకనే యీగ్రంథము శకపూర్వమని నిశ్చితమగుచున్నది. ఇందు సప్తఋషిచారము వర్ణింపఁబడ లేదు. ఇందువలన నీకల్పన తరువాతిదియని తెలియుచున్నది. ఇందు యుగపురాణమనుపేర నొకయధ్యాయమున్నది. కాని యది 64 అంగములయొక్క సూచియందు లేదు. (దీనినిఁబట్టి యది పిమ్మట గలుపఁబడెనని చెప్పవలసియుండును.) అయినను అదిమిగులఁ బ్రాచీనము. అందుఁ బాటలీపుత్రస్థాపనశాలి శుకరాజు మొదలైనవారియొక్క వర్ణనయున్నది. 'సాకేతే సప్తరాజానో భవిష్యంతి,' ఈప్రకారముగా శకరాజులనుఁ జర్చకూడనున్నది. యుగపరిమాణమింతయని చెప్పఁబడలేదు. అయినను కృతయుగవిషయమున "శతవర్షసహస్రాణి ఆయుస్తేషాం కృతే[illegible]గే" అని చెప్పెను. ఈవాక్యమునుబట్టి నాలుగుయుగములఁ బండ్రెండువేలసంవత్సరములవి యని వచించుటకు వీలులేదు.

శతం శతసహస్రాణా మేష కాలః సదా స్మృతః; పూర్ణేయుగసహస్రాంతే కల్పో నిశ్శేష ఉచ్యతే.

ఈవిధముగా నింకొకశ్లోకమున్నది. ఆవిషయ మట్లుండఁగాక! ఈవిషయములవలనఁ బూర్వోక్తమైన వృద్ధగర్గసంహితాగ్రంథమే మహాభారతమున నుల్లేఖింపబడెనని నిశ్చయమగుచున్నది. ఇందు 64 అంగములును 40 ఉపాంగములును గలవని వర్ణింపఁబడెను.

శ్యము సమాప్తమైనతరువాత, రెండవసాహిత్యము ఇతి
హాసములది. మఱియుఁ బురాణము లదిగా నున్నది. ఇతి
హాసములకును బురాణములకును గొంత భేదము కలదు.
ఇతిహాసమునఁ బ్రత్యక్షఘటితములైన విషయము లుం
డును. పురాణమందన్ననో ప్రాచీనములైన కల్పితకథ
లును, రాజవంశములు నుండును. ఈపురాణములు మహా
భారతముకంటెఁ బూర్వ ముపనిషత్కాలమునఁ గూడ
నుండెనని యుపనిషత్తులవలనఁ దెలియుచున్నది, కాని
యవి యనేకములో లేక యేకమో యని చెప్పుటకు
శక్యము కాకున్న వేదములను, నుపనిషత్తులను జదువుట
యేవిధముగా బ్రాహ్మణులయొక్క పనిగా నుండెనో,
ఆవిధముగా నితిహాసములను బురాణములను బఠించుట
సూతులయొక్క పనిగా నుండెను. మహాభారతమునఁ
గూడఁ జెప్పఁబడియున్నది. అనుశాసనపర్వముయొక్క
రతా-వ యధ్యాయమందు రాజులను స్తుతించుట సూతుల
పనియని వ్రాయఁబడినది. మహాభారతమునుగూడ సౌతి
శౌనకునకు వినిపించెను. ఇతిహాసము స్వతంత్రమైన
గ్రంథసముదాయముగా నుండును, కాని మహాభారతము
నకుఁ బిమ్మట, ఈసమస్తగ్రంథసముదాయము, మహా
భారతములోనే కలిసిపోయి యకారణముచేత లోపిం
చిపోయెను. కాని యిప్పు డీప్రశ్న కలుగుచున్నది. ఉప
నిషత్తులలోఁ జెప్పఁబడిన యితిహాసము లేవి? రామాయ
ణము, మహాభారతము రెండు గ్రంథములు ఇతిహాసములు.
ఈవిషయ మాగ్రంథములలో స్పష్టముగాఁ జెప్పఁబడి
యున్నది. వీనియొక్క మూలగ్రంథము లుపనిషత్కాల
ములోఁగూడ నుండియుండును. ఇవిగాక యింకను చిన్న
చిన్న యితిహాసములు మఱికొన్ని యుండియుండునని
యనుకొనుటకు నేయాపత్తియు లేదు. మహాభారతము
పెరిగి పొడవు పెఱల్పునకు పెద్దసుడిగాలిలో నవి సంభ
వించుటచేత, వాటియొక్క యస్తిత్వము లోపించిపో
యెను. అదిగాక మహాభారతమునకు దరువాతి గ్రంథ
ములయందు నితిహాస మనఁగా 'భారతమనియే' నిరూపిం
పఁబడియున్నది. కాని మహాభారతమందే కొన్నిస్థలము
లందు నితిహాసశబ్దము లభించుచున్నది. అక్కడ మహా
భారతమని యెట్లు గ్రహింపఁ బడఁగలదు? ఉదా
హరణార్థము, ద్రోణవిషయమున నిట్లు వర్ణింపఁబడినది:

సాంగోక్తిశ్చ పరుషో వేదా
న్సాంగా నాఖ్యానపంచమాన్.

ఇక్కడ టీకాకారుఁడు ఆఖ్యానశబ్దమునకు బు
రాణభారతాదికము నర్థముచేసెను. కాని భారతయుద్ధ
మునను ద్రోణుఁడు భారతయుద్ధమునకుఁ దరువాతఁ
గావింపఁబడిన యాభారతము నెట్లు చదువఁగలుగును?
అనఁగా మహాభారతకాలమున భారతము ఒక ప్రత్యేక
గ్రంథముగా నుండెను. అదియుఁగాక యయ్యది చాలఁ
బ్రాచీనమై యుండెను. వేదములతోఁ గూడ భారత
మును జదివెడుపద్ధతి మిగులఁ బ్రాచీనమై యుండెను.
ఈకారణముచేతఁ వేదములతోఁ గూడ భారతము నుచ్చ
రించుట పరిపాటియైనది. ఇఁకఁ బురాణములనుగూర్చి
కొంచె మెక్కుడు వ్రాయవలసియున్నది. వాయుపురా
ణము మహాభారతమున స్మరింపఁబడెను. కనుకఁ బదు
నెనిమిది పురాణములును మహాభారతకాలమున నుండి
యుండును. వనపర్వమున 19వ యధ్యాయములో నీశ్లో
కమున్నది—

ఏవం తే సర్వమాఖ్యాతం అతీతానాగతం తథా;
వాయుప్రోక్త మనుస్మృత్య పురాణ మృషిసంస్తుతమ్.

మొట్టమొదట బురాణములయందు, పురాణము,
అనఁగా నేది యతీతమో అదే, అదే చెప్పుట కుద్దేశిం
పఁబడియుండును. కాని తరువాత ననాగతములనుగూడ
భవిష్యద్రూపమునఁ బురాణమందుఁ జెప్పెడివాడుక మ
హాభారతకాలమున వచ్చియుండును. శాంతిపర్వముయొ
క్క 318వ యధ్యాయమునందు లోమహర్షణుఁడను
సూతుఁడే సమస్తపురాణకథకుఁడని చెప్పఁబడెను. ఈ
లోమహర్షణుని పుత్రుఁడగు సౌతి మహాభారతకథను జె
ప్పెను. అనఁగాఁ బదునెనిమిదిపురాణములును మహాభా
రతముకంటె మునుపటివి. మహాభారతమునం దొకచో
ట (స్వర్గారోహణపర్వములో 6వ యధ్యాయమున)
వ్యాసుఁడు పురాణములను బఠించెనని చెప్పఁబడినది.
ఇందువలన వ్యాసునియొక్క యాదిపురాణ మొకటి
యుండెనని తెలియుచున్నది. అతనికిఁ బూర్వము లో
మహర్షణుఁడు భిన్నభిన్నములైన పదునెనిమిది గ్రంథ
ములను గావించెను. కాని యారంభములోని పురాణము
లు నిప్పటిపురాణములు నొకటి కావు. ఎందుచేతననగా

వనపర్వమున వాయుప్రోక్తమని చెప్పి కలియుగము వర్ణింపఁబడెను. దానికిని నేఁటి వాయుపురాణమునకును భేద మగుపడుచున్నది. వాయుపురాణమందు హాప్కిన్సుమహాశయుఁడు చూపినట్లు— కలియుగమునఁ బదు హారేండ్లకంటెఁ గూఁడ చిన్నపిల్లలు సంతానవతు లగుదు రని వర్ణన యున్నది. ఇక మహాభారతమున, నైదారేండ్లవయసుగల బాలికలకు సంతానము గునని వర్ణన యున్నది. మహాభారతమందున్న వర్ణన వాయుపురాణముకంటెఁ గూడఁ బదియాఱులు ముందు నకు చేయుటలో నాశ్చర్యము లేదు. కాని మహాభారతములోని వర్ణన ప్రాచీనవాయుపురాణమునుండి తీసికొని పెంచఁబడినది. మహాభారతమునఁ బురాణము, ఆఖ్యానము, ఉపాఖ్యానము, గాథ, ఇతిహాసము, అని వేఱువేఱు శబ్దములు వచ్చుచున్నవి. వాటియొక్క భిన్నభిన్న భేదము లీలాగున నగుపడుచున్నవి. ఎట్లనఁగా, ఆఖ్యాన మొకవృత్తమునకు సంబంధించుచున్నది. మఱి యితిహాస శబ్దము, ఇతి + హ + ఆస ఈయర్థముచేత, మిక్కిలిప్రాచీనవృత్తి మనునర్థమున నగుపడుచున్నది.

## న్యాయశాస్త్రము

సభాపర్వములోని నారదస్తుతియం దీశ్లోకమున్నది:—

ఐక్యసంయోగనానాత్వ సమవాయవిశారదః,
పంచావయవయుక్తస్య వాక్యస్య గుణదోషవిత్;
ఉత్తరోత్తరవక్తా చ వదతోఽపి బృహస్పతేః.

ఇందు ఐక్యము, సంయోగము, నానాత్వము మొదలు గాఁగలవానియొక్క వర్ణన యున్నది. అవి యేశాస్త్రములోనివి! దీనికుత్తరమిచ్చుట కష్టము. ఈవర్ణన యన్ని శాస్త్రములకు సమానముగనుగా నుపయోగించునని టీకాకారుఁడు వ్రాసియున్నాఁడు. కాని యాలోచింపఁగా నీవర్ణన, యింకను విశేషించి 'సమవాయ' శబ్దము, న్యాయశాస్త్రమును సూచించును. గౌతముని న్యాయశాస్త్రము మహాభారతకాలమునఁ బ్రసిద్ధమైయుండు ననుటకు నాటంక మేమియును లేదు. 'పంచావయవయుక్త' వాక్యము, గౌతమకృత న్యాయశాస్త్రము నందలి సిద్ధాంతములకే యుపయుక్తముగాఁ గనఁబను చున్నది. మహాభారతమున గౌతమునిమాట లేదు; గౌతమునిన్యాయశాస్త్ర మెప్పుడు పుట్టినదియుఁగూడ నేఁటి వఱకు నిశ్చితము కాలేదు. ఇపుడు ప్రసిద్ధములైన న్యాయసూత్రములు మహాభారతమునకుఁ దరువాతివి. కాని శాంతిపర్వముయొక్క ౨౧౦-వ యధ్యాయమున న్యాయశాస్త్రము మహాభారతముకంటె ముందటిదని వ్రాసెను. ఆశ్లోకమిది.

న్యాయతంత్రా ణ్యనేకాని తైస్తై రుక్తాని వాదిభిః

ఈన్యాయమును వాదవివాదములయందు నుపయోగించుచుండిరనుట స్పష్టపడుచున్నది; ఎందుచేత! ఇందువాదిశబ్దము ప్రయోగింపఁబడినది.

నారదుఁడు బృహస్పతికంటెఁగూడ నుత్తరోత్తరవక్త యని చెప్పఁబడెను. ఇందువల్ల న్యాయశాస్త్రముతోడనే వక్తృత్వశాస్త్రముకూడ మహాభారతకాలమునఁ బ్రచలితమైయుండునని తెలియుచున్నది. శ్రోతయొక్క హృదయమునందుఁ దనభాషణమునలనఁ బూర్ణ పరిణామము కావలయునన్నచో, నక్కఱకు వక్తృత్వశాస్త్రము (రేటారిక్—(rhetoric) తప్పక సిద్ధించియుండవలయును. ప్రాచీనకాలమున వేర్వేఱు ధర్మములయొక్క వాదవివాదమున హేతువిద్యయు వక్తృత్వశాస్త్రము రెండే యుపయోగించుచుండెడివి. ఒకరు భాషించినమీఁద రెండవవారింకను బ్రభావశాలియగు భాషణమును చేయుట వాదవివాదమునఁ జాలనుపయోగించుచున్నదని చెప్ప నవసరము లేదు. మఱియు భారతకాలమునఁ బ్రాచీనరాజులకుఁ దత్త్వజ్ఞానవిషయమునందు నిట్టివాదవివాదములు ప్రసిద్ధముగా వినుటకు చెక్కువకోరిక యుండెడిది. ఈప్రకారమైన యభిరుచి యవనులకుఁగూడ నుండెను. ఉత్తితిని ప్లేటో వ్రాసిన యతిసంవాదములు కలవు. అవి నేఁటిదనుకఁ బ్రపంచమునిండ మనుష్యులకు నానందము నిచ్చుచున్నవి. ఈకారణముచే వక్తృత్వశాస్త్రముయొక్క యభివృద్ధి యేప్రకారముగా యవనుల కిట్టి మరియేఁ అదేప్రకారముగా భారతవర్షమునఁగూడ మహాభారతకాలమున నుండెను. కాని తరువాత నీశాస్త్రము మఱలఁ జిగిరింప లేదు. దీనికిఁ బ్రతిఫలముగా నేఁటి సంస్కృతముయొక్క గద్యపద్యరచనయందు సొగసిగ

ను కృత్రిమత్వమును బుట్టించెనో, యట్టియలంకార శాస్త్ర ముదయించెను. వక్తృత్వశాస్త్రము మహాభారత కాలమున నవశ్యము కలిగియుండును. దీనికి సాక్షి మహా భారతములోని జనకసులభాసంవాదము. ఈసంవాదము కొంతకొంత ప్లేటోసంవాదమువలె నున్నది. దానియందు నొకవక్త మఱియొకవక్తతోఁ జాలఁ బ్రశస్తమైనభాష ణముఁ జేయుచున్నాఁడు. ఈసంవాదమున సులభ తన యుత్తరారంభమున వాక్యమెట్లుండవలయునో, దాని యొక్క గుణదోషములు లేవేవియో, యీవిషయమున వివరించెను. ఇప్పుడు దాని భాషాంతరీకరించుట యనా వశ్యకము. ఈజనకసులభాసంవాదము యావత్తు పఠిం పఁదగియున్నది. అది యటుండుఁగాక; వక్తృత్వశాస్త్ర మునకుఁ బ్రతిఫలముగా నలంకారశాస్త్ర ముత్పన్నమగు టవలన మహాభారతమునకుఁ దరువాతి సాహిత్యమునందు సులభాజనకసంవాదమువంటి, లేక యుపనిషత్తులయందుఁ గూడ నున్న యాత్మసంబంధములగు ప్రవచనములవంటి సం[illegible]ములు దొరకవయ్యెను.

## ధర్మశాస్త్రము

ధర్మకామార్థమోక్షేషు యథావత్కృతనిశ్చయః;
తథా భువనకోశస్య సర్వస్యాస్య మహామతిః.

ఇది నారదునియొక్క మఱియొకవర్ణన. దీనివలన ధర్మశాస్త్రము, కామశాస్త్రము, అర్థశాస్త్రము, ఈ నాల్గుశాస్త్రములు తప్పక యుండియుండునని తెలియుచున్నది. స్వయముగా మహాభారత మునకు ధర్మశాస్త్రమనియుఁ, గామశాస్త్రమనియుఁ బేరు పెట్టియుండెను. మహాభారతమందు ధర్మశాస్త్రము మాట చాలసారులు వచ్చినది. సౌతి మహాభారతమును ముఖ్యముగా ధర్మశాస్త్రముగాఁ జేసియున్నాఁడు. మహా భారతమున నీతిశాస్త్రముమాట యున్నది. ఈనీతిశాస్త్ర మెట్టిదిగానుండెనో, యది నిశ్చయింపఁబడఁజాలదు. అయిన నయ్యది రాజనీతి, మఱియు వ్యవహారనీతి, యీ రెండిటి యాధారముమీఁద నుండియుండును. అర్థశా స్త్రము వార్తాశాస్త్రమనియుఁ జెప్పఁబడెను. మోక్ష శాస్త్రమున కాన్వీక్షికియని సంజ్ఞయున్నది. (సభాప ర్వము, మఱియు శాంతిపర్వము అ. ౫౯). ఒకచోట మానవధర్మశాస్త్రముమాట యున్నది. ఒకస్థలమున రాజ ధర్మములు వర్ణింపఁబడినవి. సమగ్రనీతిధర్మములను ముఖ్య ముగా శుక్రుఁడును, బృహస్పతియుఁ జెప్పియున్నారని నుడువఁబడినది. శాంతిపర్వమునను మొదలనే బృహస్పతి యొకలక్షశ్లోకముల నీతిశాస్త్రమును జేసెననియుఁ దరు వాత శుక్రాచార్యుఁడు దానిని సంక్షేపించెననియు జెప్పుచున్నాఁడు. దీనికిఁబిదప శాంతిపర్వముయొక్క ౫౮-వ యధ్యాయములో మనువు, భరద్వాజుఁడు, మఱియు గౌరశిరుఁడు రాజశాస్త్రప్రణేతలుగాఁ జెప్పఁ బడిరి. ప్రస్తుతసమయమున నీగ్రంథములయొక్కయుఁ బిమ్మం తరమున బృహస్పతి ప్రణీత నీతిశాస్త్రముయొక్కయు జాడ యెందును గానిపింపదు. కాని శుక్రనీతిగ్రంథ మిప్ప టికిఁగూడఁ గలదు. ఈనీతియందు సంధి, విగ్రహము మొదలగు రాజకీయవిషయములచాతుర్య మధికముగా నున్నది.

తథా భువనకోశస్య సర్వస్యాస్య మహామతిః.

ఈవాక్యమునఁ జెప్పఁబడ్డశాస్త్రము భువనశా స్త్రము కాఁబోలును. ఈశాస్త్రమునందు, సమగ్రసృష్టి నియు నెంత పెద్దదియైయున్నదో, దానియందు నెన్ని వి భాగము లున్నవో, మఱియు సర్వప్రపంచ మెటువం టిదో యీసంగతులు లోకవేళ నుండియుండును. ఇంగ్లీషు నందు దేనిని 'కాస్మాలజీ' యందురో ఆశాస్త్రము మహాభారతకాలమున వేఱుగా నుండియుండును. మహా భారతమందున్న భూవర్ణనమొదలైనవి యక్కడినుండి కైకొనఁబడియుండును. ఈప్రకారము, విద్యాంసులైన వారి యధ్యయనమునకుఁదగిన సమస్తవిషయములు నార దునివర్ణనలయందు వచ్చినవి. అతనికి వేర్వేఱు మోక్షశా స్త్రముల జ్ఞానముకూడ నుండెను. ఈశాస్త్రములు సాంఖ్యము, యోగము, మఱియు వేదాంతము మొదలై నవి. నారదునివర్ణన యింకను జేయఁబడినది. ఎట్లనగా.

సాంఖ్యయోగవిభాగజ్ఞో నిర్వివిత్సుః సురాసురాన్.

మహాభారతకాలమున సాంఖ్యము, యోగము, వేదాంతము మొదలుగాఁ దత్త్వజ్ఞానములయొక్క గ్రం థము లనేకము లుండినవనుట నిర్వివాదము. కాని, యిప్పుడు వానిలో నొకటికూడ గ్రంథము మిగులలేదు.

పవనములయుల్లేఖము, పక్షాంతరము నమమవు నాజ్ఞల యుల్లేఖము మహాభారతమందు మాటిమాటికి వచ్చుచున్నది. ఇచ్చట నక్షత్రములయుల్లేఖము లేదు. ఎట్లైనను నక్షత్రములయస్తిత్వములో నీ ప్రమాణము విశ్వసింపఁదగినదికాదు. ఎందుచేతనఁగా కేవలము నారదుఁడు చదివినవిషయములఁ గూర్చిన పైసూచిక సంపూర్ణమైనది కానందునని యూహింపఁబడవచ్చును. ఇక్కడ ఛాందోగ్యోపనిషత్తుయొక్క భాషాంతర మొకటి యీయఁబడియున్నది. ఎందుచేతనఁగా దానియందు నారదుఁడు దేవముఖమునుండియే సనత్కుమారునిలోఁ దాఁ జేసినవిషయములను బఠించెనో వక్కాణించియున్నాఁడు. నారదుఁడు శిష్యుఁడై సనత్కుమారునియొద్దకు నధ్యాత్మవిద్య నేర్చుకొనుటకై వెళ్లినపుడు, సనత్కుమారుఁడు నారదునడిగెను—"ఇప్పటిదాఁక నీవేమేమియధ్యయనము చేసితివి?" అపుడు నారదుఁ డుత్తరమిచ్చెను— "నేను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, ఇతిహాసపురాణములు, వ్యాకరణము, పిత్ర్యము, రాశి, దైవనిధి, వాకోవాక్యమేకాయనము, దేవవిద్య, బ్రహ్మవిద్య, భూతవిద్య, క్షత్రవిద్య, నక్షత్రవిద్య, మఱియు సర్పదేవజనవిద్యలఁ బఠించితిని." నారదుఁ డిందుఁ బదునాలుగువిద్యలను లెక్కపెట్టియున్నాఁడు. వీనియందుఁ గొన్నివిషయములయెడల నివి యెటువంటివో నిర్ణయించుట కఠినము. ఉదాహరణార్థము ఇందు వ్యాకరణమును 'వేదానాం వేదం' అని చెప్పెను. టీకాకారుఁడు నక్షత్రవిద్యయనఁగా జ్యోతిషమనియు, బ్రహ్మవిద్యయనఁగా ఛందశ్శాస్త్రమనియుఁ జెప్పియున్నాఁడు; మఱి పిత్ర్యశబ్దముచేఁ గల్పసూత్రమును గ్రహించెను. రాశి శబ్దము గణితశాస్త్రమైయున్నది. కాని 'వాకోవాక్యమేకాయనము' ఏదియో నిశ్చయపూర్వకముగాఁ జెప్పఁబడఁజాలదు. ఆచార్యుఁడు దేవవిద్యను శిక్షయని యర్థముచేసెను. సర్పదేవజనవిద్యాశబ్దముచేత సర్పములవిషము దిగఁ విద్యలోనగునవి తెలియుచున్నది; ఇట్లు నృత్యము, గీతము, శిల్పశాస్త్రము మఱియుఁ గలలు మొదలగు నవి యిందు వచ్చుచున్నవి. ఆచార్యుఁ డిట్లే వర్ణించెను. ఉపనిషత్కాలమున రాశి యనఁగా గణితశాస్త్రము ప్రసిద్ధమై యుండెను. మహాభారతకాలమునకు దానియొక్క యభ్యాసము మిక్కిలిగా నుండెనని యెంచవలయును. రాశిశబ్దంబు త్రైరాశికమునందు వచ్చుచున్నది. ఈగణితశాస్త్రముయొక్క యుచ్చారణము మహాభారతమున లేదు. అయినప్పటికి ననేకప్రమాణములవలన గణితశాస్త్రము యథార్థమున భరతఖండమందే యుత్పన్నమైనదనుట మాన్యమైయున్నది. విశేషముగాఁ బదియంకములగణిత మిచటినుండి యంతటను వ్యాపించినది. ఉద్ధరింపఁబడిన సూచియందు జ్యోతిశ్శాస్త్రములయుల్లేఖము గలదు. అందు మహాభారతావేళచేత గణితము, వైద్యకము రెండు విషయము లధికములుగా నున్నవి. నారదునియొక్క విద్య లన్నిటియందు నక్షత్రములమాట లేదు. అయినను దై యనుమానమువలన నక్షత్రము లుండె ననికాని లేవనికాని నిశ్చయపూర్వకముగాఁ జెప్ప వలనుపడదు. వైదికసాహిత్యముకాక మిగిలిన ప్రామాణిక గ్రంథములే స్మృతులు, ఈయన్యము శ్రుతిశబ్దములోని విరోధమువలన మహాభారతకాలమునకుఁ బిమ్మటఁ బుట్టియుండును. ఎందుచేతనఁగా బాదరాయణునియొక్క బ్రహ్మసూత్రములయందు 'స్మృతేశ్చ', 'ఇతి చ స్మర్యతే' ఇత్యాదిప్రయోగములయందు మహాభారతముయొక్కయే యాధారము గైకొనఁబడెను.

## అన్యశాస్త్రములు మఱి యుల్లేఖములు

నీతిశాస్త్రమును వర్ణించిన యొకశంబరుఁ డుండెనని తెలియుచున్నది. రెండునూఱుకోటుల వరకు చేర వచ్చినది.

నాతః పాపీయసీం కాంచిదవస్థాం శంబరోఽబ్రవీత్;
యత్ర నైవాద్య న ప్రాతర్భోజనం ప్రతిదృశ్యతే.
(ఉద్యో. అ. 72)

మహాభారతమున సంఖ్యావాచకమును పద్మశబ్దము చాలసారులు వచ్చినది.

తిష్ఠ పద్మాని వక్త్రేణ పంచ క్వైచైవ మానవ.
(శాంతి. అ. 258, 19)

ఏవి ప్రస్తుతసమయమునఁ బ్రసిద్ధములై యున్నవో, యా సంఖ్యావాచకశబ్దములన్నియు సభాపర్వమున వచ్చినవి. ఇచ్చట నవి లేవనుటకుఁ దగియున్నవి.

మహాభాష్యమైయున్నది. వీటికి భారతమునకు మహాభారతమునకు వలెనే భేదము కనుపట్టుచున్నది. మహాభాష్యముయొక్కనే కన్పటము రాలేదు. ప్రజాపతియొక్క సభయందు మూర్తిమంతములైన గ్రంథములైతే నివసించియుండెను; కాని సభయందు గ్రంథకారులు విద్యావంతు లగుట వర్ణింపఁబడలేదు. గ్రంథములు పూజ్యములైతే గ్రంథకారులుకూడఁ బూజ్యులని చెప్పుటయావశ్యకముకాదు. వేయునేల? చాలవారలు కారు కూడను. కారణము మహాభారతకాలమున భాష్యములు, నాటకములు, కావ్యములు, ఆఖ్యాయికలు మొదలుగాఁ గలవానికిఁ బూజ్యులైన గ్రంథకారు లల్పమ్ములు కారైరి. ఇదే విశ్వసింపఁదగియున్నది.

అధ్యయనమునకు నేవిషయములు, పక్షాంతరమున శాస్త్రములు, సమస్తము మహాభారతకాలమునఁ బ్రసిద్ధములైయుండెనో, అవి వైవిధ్యముగా నున్నవి. ఈవిషయములు వేదము, ధర్మశాస్త్రము, తత్త్వజ్ఞానము, రాజనీతి, వ్యాకరణము, గాయనము, భాషాశాస్త్రము పక్షాంతరమున నిరుక్తము, మఱియు యుద్ధము, కృషి, వైద్యకము, *గణితము, జ్యోతిషము, మఱియు, శిల్పశాస్త్రమునై యుండెను. ఇందనేకవిషయములు చాలఁ బూర్ణములైయుండెను. అనఁగా తత్త్వజ్ఞానము, వ్యాకరణము, రాజనీతి, మొదలుగా విషయము లెంతేని సంపూర్ణత నొందినవి. అంతకంటె నెక్కువ యభివృద్ధి భరతఖండమున నాసమయమునకుఁ దరువాత నెన్నఁడుఁ గావయ్యెను. కావ్యములు పక్షాంతరమున లౌకికవాఙ్మయము నా కాలమున నిర్మింపఁబడలేదు. మహాభారతమున నాటకములమాట యున్నది నాటకములుచేసిన బ్రాహ్మణులయు, స్త్రీవేషము ధరించిన టులయు వర్ణన యున్నది. కాని యేగ్రంథమునకుఁ, బక్షాంతరమున గ్రంథకారునికిఁ గాని యుల్లేఖము లేదయ్యెను. మహాభారతమునకుఁ బిమ్మట వీనికిఁగూడ వాస్తవమైన వాఙ్మయ ముత్పన్నమైనది. మఱియు దానికిఁ గొలఁదికాలములలోఁ బ్రబలమైన దశ ప్రాప్తించెను. మహాభారతము, రామాయణము, ఈయార్ష కావ్యములచేతనే యది యారంభమయ్యెను. భారతకాలమునఁ దత్త్వజ్ఞానముయొక్క యేసంపూర్ణవిచారము కలదో, దానిని షడ్దర్శనములు తమవిశేషసూత్రములచేత నిష్కర్షించెను. ఈ సూత్రములత్యంతము పరిపూర్ణములుగను, సర్వతోముఖముగను విచారించి సంక్షేపముగాఁ జెప్పఁబడినవియైయున్నవి. ఈకారణముచేత నందఱకుఁ బూజ్యములైనవి. కనుకనే, తత్త్వజ్ఞానసృష్టిచేత, భగవద్గీతగాక తక్కిన మహాభారతము కొంచెము వెనుకఁ బడియున్నది. అయినప్పటికిని మహాభారతమునఁ దత్త్వజ్ఞానముయొక్క చర్చ తక్కువ లేదు.



* ఎదుటి శ్లోకముచేత భారతీయార్యుల కల్పనయుఁ, గల్పశక్తియు నెంతయుండెనో తెలియును. "సూక్ష్మయోనీని భూతాని తర్కగమ్యాని కాని చిత్, పక్ష్మణోఽపి నిపాతేన యేషాం స్యాత్ స్కంధపర్యయః" (శాం. అ. ౧౫-౨౬). ఇచ్చట నేటికివిమలలోని "మైక్రోబ్" అనఁగా సూక్ష్మజంతువులయుల్లేఖము కలదు.

క. జననీనిహంత యనుచున్-నినుఁ బల్కఁగరాదె చెపుమ? నిజ మారసినన్
జనని నిహంతకులలో-ఘనుఁ డనినను దోప మెదియుఁ గలుగదు రామా!

గీ. పాపపూర్ణబుద్ధి యపుడప్డు ప్రాయికముగ-నిలను బ్రతివానికినిఁగూడఁ గలుగుచుండు
నల్పమతియైన నద్దాని ననుసరించు-నధికమతియైన నద్దాని నడఁచివైచు.

ఆ. తొలుతఁ బాపబుద్ధి దొడరిన నద్దాని-నడఁచివైచుకొనియె నతివ పిదప;
నంతమాత్రమునన యఘమాచరించిన-దనఁగఁ దగునె? దోషియనఁగఁ దగునె?

గీ. దోషమే కానిదానిని దోషమనుచు-నెంచి జనకుండు జనని వధించుమనఁగ,
మాతృవధ నల్పి; పితృనాజ్ఞ మాఁదాల్చి-నాఁడననుచును వచియింపనగునె రామ?

సీ. తొలిపల్కులందును దొలుఁదొల్తగా "మాతృ-దేవో" భవయటంటఁ దెలిసికూడ
తల్లిదండ్రి గురుండు దైవంబనెడుపట్ల-నాదిఁ దల్లిని జెప్ప టరసికూడ
గర్భంబునన్ మోసి కష్టంబులకు నోర్చి-దయమీఱఁ బెంచుటఁ దలఁచికూడ
శ్రౌతృవర్యులు పితృవాక్యంబు నిరసించు-టేటికో యయ్యది యెఱిఁగి కూడ

ఆ. "పాము నతిథిచేతఁ బట్టిచంపించెడు-రీతి దోసఁ బిలిచి మాతఁ జంపు"
మని యొసంగు తండ్రియానతి మన్నించి-జననిశిరముఁ ద్రుంపఁ జనునె నీకు?

గీ. ఎదను నీప్రజ్ఞదలఁచియో? యెందుకొఅకొ?-పొంగి నీతండ్రి "వరములొసంగు"దనఁగఁ
గోరి జననిని బ్రదికించుకొంటివి, పట్టు-గాక యుంచిన రవ్వంతగలదె ఫలము?

గీ. కన్నవారలపై భక్తిఁ గలిగినట్టి-యుద్ధతమమగు ధర్మంబు లెఱిఁగినట్టి
కొమరుఁడేమైన జనకునికోసముడిచి-తల్లి యాపదఁ దప్పింపఁ దలఁచుఁ గాదె?

చ. కఱచితి విద్యలం బ్రతియకారుని సన్నిధి నంచుఁ బెద్దగా
నఱచిన నేమిలాభ; మిసుమంత యెఱుంగవు ధర్మసూక్ష్మముల్
గరుణ రవంత లేదు; చెనకన్ వెనుదీయ; విదేమి పాపమో?
పరశుధరా! నృపాలవనపావక! దారుణ రాజహంతకా!

ఉ. బాహుబలంబుగద్దనుచుఁ బగ్గెలు గొట్టుచు వక్రమంబుగా
సాహస మాచరింపు మను చక్కకులేంద్రున కడ్డు నిల్చి నీ
ద్రోహపుబుద్ధిఁ గన్పఱచి దుర్భరభంగము నొందు టేల? మాం
పాహి యనంగనేల? కులధార, కుచేతలుగాక భార్గవా!

ఉ. న్యాయముగాదు దేవ! కరుణా క్షమియింపుమటంచు వేఁడు గాం
గేయుని ధర్మకోవిదు సుకీర్తిపరుం బ్రియశిష్యుఁ బట్టి య
న్యాయ మొనర్పుమంచుఁ గదనంబున కీడ్చిన చేత మెట్టిదో
ధీయుత, సంస్మరింపుము! నుతించునె లోకము సుంత? భార్గవా!

ఉ. కండలు రక్తముం గలసి కాలువలై ధరఁ బాఱునట్లు నా
ఖండలుఁ దూరువుం దొలిచి కాఁతియ వెట్టఁగ నోర్చి నీపయిం
మెండగుభక్తిఁ గప్పుఅనుమేటిని భార్గవ శిష్యుఁ గర్ణు ను
ద్దండతఁ దిట్టినాఁడవుగదా? యిది ధర్మమె నీకు భార్గవా!

గీ. ఉన్న మాటలు వలుకఁగా నూరకోనవు-తగని గర్వంబునం గాలుఁ ద్రవ్వుకొనుచు
నదియిది యొనర్చినానని యనుకొని-సర్వదూరమ్ము లయ్యవి సొంతముగను.

గీ. ఇంతకన్న నొనర్చిన దేమిచెపుమ?-ధరకు భారంబ దేమి నీహారణమేమి?
కాయవస్త్రంబులేమి? యోగపు లేమి?-చెప్పరము లేమి? యవి దాటు తెలుఁగు లేమి?

సీ. పుట్టినాఁడవు జగత్ప్రఖ్యాత రేణుక-గర్భమందుఁ గులంపు గణుతి కెక్కఁ
గట్టినాఁడవు జగజ్జెట్టివై లోకాప-కారంబొనర్పఁ గంకణముఁ జేతఁ
బట్టినాఁడవు హృది భయదాకృతి నెంచి-కుతుకంబుతోఁ జేత ఘోరపరశుఁ
గొట్టినాఁడవు ప్రజాకోటికిన్ సుఖదమై-వఱలు రాట్కానన మిరువదొంట
విడిచినాఁడవు జమదగ్ని వెగటుచెందఁ-దర్పణంబులు నృపుల రక్తంబుతోన
నరిగినాఁడవు క్రౌర్యంబు నాచరించి-నిరుపమాన గుణోద్దామ! పరశురామ!

సీ. పరిభవదావాగ్నిఁ బడి క్రుంగి వెఱపుచే-విలు దాశరథిచేతఁ బెట్టినావు
పాపంబు హృదయముం బాధింప దక్షిణ-వార్ధి గొడ్డలిఁ బాఱవైచినావు
గర్వాంధకారంబు కనులవీడినతోన-చెడుచేతలకు స్వస్తి చెప్పినావు
గొంతులూర్చి గడించుకొనిన రాజ్యం బని-భీతిఁ గశ్యపుచేతఁ బెట్టినావు
క్రూరకమునఁ దనుపల్కుల కోర్వలేక-యేఁగి యింద్రాద్రి మీఁదికి నెక్కినావు
నలిపినట్టి యఘుంబెల్ల నమసిపోవ-ముక్కుమూసుక మునినంచు ముడిఁగినావు.

గీ. నత్యశౌచదయాధర్మశమదమాది-గుణములం దాల్చి ముక్కుమూసికొనుచుచుండు
భానుమండవు నీకింత రోషమేల? గర్వమది యేల? మదికింత కలఁతయేల?

---




# ప్రతిమానాటకము

[భాసకృతికి తెనుగు]

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

[౮-వ సంపుటము ౧౮-వ సంచిక తరువాయి]

పంచమాంకము

(అంత సీతయు, తాపసియు, ప్రవేశింతురు)

సీత

అమ్మయ్యా! పూజకై తెచ్చినపూవు లంతట్టా రాలి ఉండగా ఆశ్రమమును చక్కగా ఊడ్చినాను. ఆశ్రమపు ఉనికికి అనువయ్యేటంతలో, దేవపూజ యేర్పాట్లు చేసినాను. ఆర్యపుత్రులు ఇంకా రాలేదు. వచ్చేలోగా నే నీగున్న చెట్లను నీళ్లుపోసి సంతోషపరుస్తాను.

తాపసి

అవిఘ్నముగా కానీ అమ్మా!

(పిదప రాముఁడు ప్రవేశించును)

రాముఁడు

(సశోకముగా)

ఉ. నాయన, నేను, లేనికత
నఁ మతిగొల్ప కయోధ్యపీడి నా
కై యభిషేకయత్నమున
నక్కట యిక్కడి కేఁగుదెంచె ని
శ్శాయుఁడు, తోడనే మహీభ
రంబు భరింపఁగఁ బంపినాఁడ, నా
హా యతఁ డొక్కఁడే నృపమ
హాభరముల్ దల మోచుచుండు నే!

(విమర్శించి)ఇటువంటి దేయిది! ఇఁక నే నిప్పుడిట్టి దుఃఖమును దొలఁగించుకొనుటకయి, అవస్థాకుటుంబినియయిన మైథిలిని జూతును. కాని మైథిలి యెక్కడికో యేఁగిన దే! (పరిక్రమించి చూచి) ఓహో! ఓహో!

సీ. ఆలవాలముల నింపార నుర్వులువాఱి
వారిపూరము పాఱువాఱుచుండ
దగగొన్న ఖగము లిత్తరుల చెంతలనుండి
యరుదెంచి బురుదనీ రానకుండ
బిలములందు జలమ్ము నెలకొన్నఁ గీటంబు
లంతంత మెకకల కరుగుచుండ
తరుమూలములనీరు తరుగుచున్న కొలంది
వలయముల్ క్రొంగ్రొత్త వెలయుచుండ
తియనీ రిప్పుడిప్పుడే పోయుచున్న
పగిదిఁ గనుపట్టు నీచెట్టుపాదు లింత
లంతలం బ్రాంతముల జనకాత్మజాత
చెలఁగుచుండె నటంచు సూచించుచుండె.

(విలోకించి) ఓహో! ఇదిగో వైదేహి! అయ్యో! అవస్థ!

మ. కసుగందుల్ మొలకంబునందయిన వి
క్కుంజాతీ కెంగేలు ముల్
వసివాళ్వాడుచుమాపె వారిఘటముల్
దాల్పంగనే నిందు నేఁ

చిలిరో మవ్వపుఁ బూవుఁదీవియల క
ట్లే బోట్లకుం గూడఁ గ్రొ
త్త వపాటుం గలిగించునోటు! కలయం
గాంతారపుం బ్రాంతముల్!

(చేరఁబోయి) మైథిలీ! తపసు వర్ధిల్లుచున్నదా?

సీత

ఓహో! ఆర్యపుత్త్రులు! ఆర్యపుత్త్రులకు జయము!

రాముఁడు

మైథిలీ! నీధర్మకార్యమునకు విఘ్నములేదేని కూర్చుండుము.

సీత

ఆర్యపుత్త్రుల సెలవు ప్రకారము (కూర్చుండును.)

రాముఁడు

మైథిలీ! దేనినో అమిత నభిలషించుచున్నట్లుంటివి? ఏమిది?

సీత

శోకముచేత వ్యాకులచిత్తులుగా ఉన్నట్టున్నారు మీరు; ముఖముతీరు చూడగా కంది ఉన్నది. ఏమిటిది?

రాముఁడు

మైథిలీ! వ్యాకులత కిది అవసరమే కదా!

గీ. హృదయమదరంట జముఁ జేసె గుదియ వ్రేటు
నాఁటి దాపుండు నేటికి నట్టియుండె
దానిపై మాటిమాటికిఁ దాఁకుచుండెఁ
బలు ప్రయోజనముల శోకబాణహతులు.

సీత

ఆర్యపుత్త్రుల కిప్పుడు సంతాప మెందుకు కలుగవలెను?

రాముఁడు

రేపు నాయనగారి యనుసంవత్సరశ్రాద్ధవిధి. కల్పవిశేషముచే పితరులు పిండప్రదానము నపేక్షింతురు. కావున రేపు దీని నే నెట్లు నిర్వర్తింపఁ గల్గుదునా యని చింతించుచున్నాఁడను. లేకున్నను,

గీ. అందుదురు తృప్తి వా రెట్టులైనఁగాని
నాదశను వారెఱింగియున్నార కాదె;
వినయమన్నించుచుంటె నాయనకు, నాకు,
నర్హమగునీతినే పూజ నాచరింప!

సీత

ఆర్యపుత్త్రా! భరతు డక్కడ విభవముతో శ్రాద్ధము జరుపును. స్థితిగతులకు తగినట్లు మీ రిక్కడ ఫలోదకములతో జరుపుదురు గాని! ఇదీ నాయనగారికి మిక్కిలీ ప్రియమే అవుతుంది.

రాముఁడు

మైథిలీ!

క. ఫలములు దర్భలపైఁ జే
తులతో నే నిడుటఁజూచి తోఁడని నేఁ గా
నలమండుటఁ దలపోయును
విలపించుఁ; దీనఁగూడ వెత నాయనకున్.

(అంతఁ బరివ్రాజకవేషముతో
రావణుఁడు ప్రవేశించును)

రావణుఁడు

ఔరా! ఈనేను!

ఉ. తేరకు ముక్కు ఖరాసురు న
ణించి విరోధము తెచ్చికొన్నదు
ర్వారుని రామునిఁ గపట
వేషమునఁ జని కాంచివంచనన్

దారిచి తప్పఁద్రోచి నుప
దన్వరసంస్కృతి శూన్యయౌ హవి
ర్ధారనుబోలె జానకి న
దాటున నే హరియింప నేఁగెదన్.

(పరిక్రమించిచూచి) ఇది రాముని యాశ్రమ స్థానమునకు ద్వారము. ఇఁక దిగుదును. (దిగును.) ఇదిగో నేను నతిథిమర్యాద ననుష్ఠింతును. నేను అతిథిని. ఎవరక్కడ!

రాముఁడు

(విని) అతిథికి, స్వాగతము!

రావణుఁడు

స్వాభావికమగు రూపసౌందర్యము స్వరసౌభాగ్యముచే నిబ్బిడియయ్యెఁగదా!

రాముఁడు

(చూచి) ఓహో! స్వాములవారు! స్వామీ! అభివాదనము చేయుచున్నాఁడను.

రావణుఁడు

స్వస్తి.

రాముఁడు

స్వామీ! ఈ యాసనముపై నాసీనులరగుఁడు.

రావణుఁడు

(ఆత్మగతము) ఏమి! ఈతఁడు నన్నాన పెట్టుచున్నాఁడు! (ప్రకాశము) లెస్స. (కూర్చుండును.)

రాముఁడు

మైథిలి! స్వాములవారికి పాద్యముగొని తెమ్ము!

సీత

ఆర్యపుత్త్రుల సెలవుప్రకారము. (వెళ్లివచ్చి) ఇదిగో ఉదకము.

రాముఁడు

స్వాములవారిని శుశ్రూషింపుము.

సీత

ఆర్యపుత్త్రుల సెలవుప్రకారము.

రావణుఁడు

(మాయాప్రకాశన పర్యాకులుఁడై) ఉండనీ, ఉండనీ.

గీ. పుణ్యసాధ్వి యీమె భూమి నరుంధతీ
కాంతచూపె మర్త్యకాంతలందు
ఈమె భర్త వంచునల్ల పతివ్రతల్
మెచ్చుచుండ్రు నిన్ను హెచ్చుగాను.

రాముఁడు

అట్లని యిటు తెమ్ము. నేనే శుశ్రూషింతును.

రావణుఁడు

అయ్య! నీడను దప్పుకొన్నవాఁడను, శరీరము నేలంఘింప నంగీకరింతునా? మాట మంచితనమున నే యతిథి సత్కారముగలదుగదా! సత్కారము జరిగెను. ఆసీనుఁడవగుము.

రాముఁడు

లెస్స—(కూర్చుండును).

రావణుఁడు

(ఆత్మగతము) నేనును బ్రాహ్మణసముదాచారము ననుష్ఠింతును. (ప్రకాశము) నేనయ్యా! కాశ్యపగోత్రుఁడను. సాంగోపాంగముగా వేదము నధ్యయనము చేసితిని. మానవీయ మగు ధర్మశాస్త్రమును, మాహేశ్వరమగు యోగశాస్త్రమును, బార్హస్పత్యమగు నర్థశాస్త్రమును, మేధాతిథి న్యాయశాస్త్రమును, ప్రాచేతస శ్రాద్ధకల్పమునుగూడ నధ్యయనము చేసితిని.

రాముడు

ఏమీ స్వామీ! శ్రాద్ధకల్పమునుగూడ సధ్య యనము చేసితిరా?

రావణుడు

సర్వశ్రుతులను విడిచి శ్రాద్ధకల్పముమీఁద నాస్థచూపుట యిదియేమి?

రాముడు

స్వామీ! జీవత్పితృకతాభాగ్యము చెడుటచే నది యుపేక్షింపవలసెను.

రావణుడు

దాని నడుగ నభ్యంతరపఱచుటకాదు. అడుగ వచ్చును. అడుగుము.

రాముడు

స్వామీ! పిండప్రదానకాలమందుఁ బితరు లను దేనిచేఁ దృప్తిపఱుపఁగల్గుదును?

రావణుడు

శ్రద్ధతో దేని నొసఁగినను శ్రాద్ధ మగును.

రాముడు

స్వామీ! అనాదరముతో నొసఁగినది పరి త్యక్తమే కాని శ్రాద్ధముకాదు. సరియే; నేను విశేషము నెఱుఁగుట కడుగుచున్నాఁడను.

రావణుడు

అట్లైన వినుము. మొలకలలో దర్భలు, ఓష ధులలో తిలలు, శాకములలో కలాయము, పశువులలో వార్ధ్రీణసము, మృగములలో గోవో ఖడ్గమో అయినను, ఇట్టివి మనుష్యు లకు విహితములు.

రాముడు

స్వామీ! 'అయినను' అనుటచే నింకఁ గూడ నేదో కలదని తెలియవచ్చుచున్నది.

రావణుడు

కలదు. అది ప్రభావసంపాద్యము.

రాముడు

స్వామీ! ఇదియే నా నిశ్చయము.

గీ. ఉభయమును సన్నిధానమైయున్న; దందు
దీని నెయ్యది సాధింపఁగాఁ దగినదో;
తపసు చాలనిదైనను ధనువు గలదు
ధనువు చాలనిదైనను దపసుగలదు.

రావణుడు

కలవు. కాని యవి హిమవంతమున నుండును.

రాముడు

హిమవంతముమీఁదనా? ఏవి! చెప్పుఁడు!

రావణుడు

హిమాలయపు నస్తమశిఖరముమీఁద సాక్షా త్పరమశివుని శిరస్సున నుండి క్రిందికి బడు చుండు గంగోదకములఁ ద్రావునవి, వైదూర్య శ్యామపృష్ఠములు, పవనసమజవములు, కాం చనపార్శ్వములునగు మృగములు గలవు. వై ఖానసవాలఖిల్యనైమిశీయాదులగు మహర్షులు తలఁచినంతమాత్రముననే యవి యరుదెంచి యాపన్నము లగుచుండును. వానిచే వా[illegible] చేయు శ్రాద్ధకర్మలు చక్కఁగా సాగుచుం డును.

ఉ. పుత్త్రీకలంబుఁ బొందుదురు,
పొల్తురు నిర్జరులై, సముజ్జ్వలద్

గాత్రములన్ విమానగతి
    గాంతురు వేల్పులతో మతెప్డు దా
పత్రియు చింతలంబడరు,
    పాయక కాంతురు సార్వకాల మా
ముత్రికసౌఖ్య మమ్మృగము
    మూలమునన్ బరితృప్తులౌ పితల్.

రాముడు

మైథిలి!

చ. కొమరులమాడ్కి నీకుఁ గడుఁ
    గూర్చెడు జింకలతోడ, నెయ్యపుం
ద్రుమములతోడ, వింధ్యవని
    తోఁ, జెలికత్తియలౌ లతాళితో
హిమగిరికాననంబుల వ
    సిద్ధమహౌషధి దీపితంబులం
దమర వసింపఁ నేఁగుదు మ
    టంచు వచించి యనుజ్ఞఁ బొందుమా!

సీత

ఆర్యపుత్త్రిల సెలవుప్రకారము.

రావణుఁడు

కౌసల్యాతనయా! అంతగా బులుపాటము పెట్టు కోవలదు. అవి మనుష్యులకుఁ గానరావు.

రాముఁడు

స్వామీ! హిమవంతమునఁ గదా అవి యుం డును?

రావణుఁడు

ఔను.

రాముఁడు

అట్లేని స్వాములు చూచుచుండురుగాక!

క. మంచుం గుబ్బలితేఁ డల  [లే
    కాంచనమృగములను నాకుఁ గన్పఱుపవ
    చంచన్మచ్ఛరనిహారీ
    క్రౌంచాచలసామ్యమేటిఁ గాంచంగవలే.

రావణుఁడు

(ఆత్మగతము) అహో! అసహ్యముగదా వీని యవలేపము! (ప్రకాశము) అన్నా! మెఱుపులు రాలుచున్నట్టున్నవి. కౌసల్యాతనయ! ఇక్ష్వాకునే యున్ననుగూడ నిన్ను హిమవంతుఁ డారాధించుచున్నాఁడు. ఇదే! కాంచనపార్శ్వ మృగము!

రాముఁడు

స్వాములవారి యనుగ్రహ మిది!

సీత

ఆర్యపుత్త్రిల అదృష్టము!

రాముఁడు

కాదు. కాదు.

గీ. అహహ నాయనగారిభాగ్యముచుమి యిది!
    తాన యమ్మృగ మిచటికిఁ దరలివచ్చె
    పూజ కియ్యది తగియుండెఁ; బోయి నీవు
    మైథిలీ! లక్ష్మణునకు నీమాట తెలుపు.

సీత

ఆర్యపుత్త్రి! తీర్థయాత్రనుంచి తిరిగివస్తూఉన్న మునికులపతిని ఎదురుకోవలసిన దని సౌమిత్రికి ఆనతిచ్చితిరి గదా!

రాముఁడు

అట్లేని, నేనే వెళ్లెదను.

సీత

ఆర్యపుత్త్రి! నే నేమి చేయవలెను?

రాముడు

స్వామిని సేవింపుము.

సీత

ఆర్యపుత్త్రుని సెలవుప్రకారము.
(రాముడు నిష్క్రమించెను.)

రావణుడు

అన్నా! ఇదిగో అర్ఘ్యమును గైకొని రాఘవుఁడు వచ్చుచున్నాఁడు. ఇదిగో ఇప్పుడు, పరిగిడుచున్న మృగమును జూచి రాఘవుఁ డర్ఘ్యము నట్టెయుంచి ధనురారోపణము చేయుచున్నాఁడు.

గీ. అద్దిరద్దిర! బలము! వీర్యంబు వహవ!
చాఁగు రే!సత్త్వ!మయ్యారె జవము!చూడ
రామవరనామచిహ్నశరద్వయమున
నఖిలజగమును బర్యాప్త మగును దగును.

ఇదె మృగము ఒక్కదాటులో శరవిషయము నతిక్రమించి బీటుటడవిలోఁ జేరినది.

సీత

(ఆత్మగతము) ఆర్యపుత్త్రునిబాసి ఒంటరిగా ఉండడం నాకిక్కడ దిగులుదిగులుగా ఉన్నది.

రావణుడు

(ఆత్మగతము)

గీ. పాయఁజేసితి రాముని మాయఁజేసి
కూఁతలిడుదాని, బాల, నాకోర్కి, సీత
నాగి నమంత్రోక్తమైన యాహుతినివలెఁ ద
పోవనమ్ముననుండి కొంపోవువాఁడ.

సీత

పర్ణశాలలోనికి పోతాను. (పోఁజూచును.)

రావణుడు

(స్వరూపముదాల్చి) సీతా! నిలు; నిలు;

సీత

(భయముతో) అయ్యో! ఎవడివాడు నీవు!

రావణుడు

ఏమి యెఱుఁగవా!

చ. కణఁగి మహేంద్రుఁదొట్టి సుర
కాండము గం డడఁగించినట్టి రా
వణుఁడను నేను, శూర్పణఖ
వంచనముల్ ఖరదూషణాదిమా
రణమును, గంటి వింటి సు దు
రాత్మ మహాబలు, రాము వంచనన్
మణఁగఁగఁ గొట్టి నిన్ను సుకు
మారి! యిదే హరియింపవచ్చితిన్.

సీత

అయ్యో! రావణుడా నువ్వు! (వెళ్ళడును.)

రావణుడు

అన్నే! రావణునికంటె కగపడి నీవింక నెక్కడికిఁ బోఁగలవు?

సీత

ఆర్యపుత్త్రా! కాపాడండి! కాపాడండి! సౌమిత్త్రీ! కాపాడు! కాపాడు!

రావణుడు

సీతా! నాపరాక్రమమును వినుము!

మ. పురుహూతుం బరిభూతుఁ జేసితిని దా
పుల్ దాఁచితిన్ బ్రహ్మఁ గి
న్నరనాథుం బరిబాధితుం జలిపితిన్
దండించితిన్ నండి ని

వ్వాలపాలై దురపిల్లు వేల్పులకు నం
వేశం బసీ! స్వర్గ! మ
య్యారె భూలోకము ధన్యమయ్యెఁ గదె సీ
తా! నీవు వర్తిల్లుటన్.

సీత

ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి! సౌమిత్రీ! కాపాడు! కాపాడు! నన్ను!

రావణుఁడు

గీ. శరణు వేఁడుము రాము, లక్ష్మణుని శరణు
వేఁడు, దశరథునేనియు వేఁడు శరణు;
అల్పమనుజులు నన్నేమి సల్పఁగలరు
కోల్పులిని జింకపిల్ల లదల్పఁగలవె!

సీత

ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి! సౌమిత్రీ! కాపాడు! కాపాడు!

రావణుఁడు

ఉ. ఏడిచెదేల! బేల! కను
మా! నను మీనవిలోలనేత్ర! నీ
వేఁడెదు నార్యపుత్త్రునటు
వేడుక సేయుమి నన్నుఁగూడఁ, బో
రాడఁగ నేఁగుదేరఁ గలఁ
డా యిఁక రాముఁడు సేనలెన్ని వెం
టాడిన నేని, వేల్పులు స
హాయులుగా నరుదెంచిరేనియున్.

సీత

(రోషముగా) శపిస్తున్నాను!

రావణుఁడు

హాహాహా! అబ్బో! పతివ్రతా తేజము!

గీ. ఆకసమ్మున నేను దూఁకాడునపుడు
సూర్యరశ్ములుగూడ నన్ జూఁడలేవు!
ఈమె శపియింతునన్న యీయింతపలుకు
తాఁకుచే నాదుమే నెల్ల దగ్ధమయ్యె.

సీత

ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి!

రావణుఁడు

(సీతను బట్టుకొని) ఓహో! జనస్థానవాసులారా! తపస్వులారా! వినుఁడు, మీరు వినుఁడు!

గీ. దశముఖుండు భూమితనయ నిదే! బలా
త్కారమున హరించి తరలుచుండె
క్షాత్రధర్మమందు సామర్థ్యమున్నం బ
రాక్రమించుఁగాక రాముఁ డింక!

సీత

ఆర్యపుత్రా! కాపాడండి! కాపాడండి!

రావణుఁడు

(పరిక్రమించుచు, చూచి) అన్నా! స్వపక్షపవనోత్క్షేపముచే నరణ్యమునెల్ల క్షుభితపఱచుచు, చండచంచువగు జటాయువిదె నన్నెదుర్కొనుచున్నది! ఆసి! ఆగుమోయి అక్కడ!

క. గండారెడు మద్భుజమున
నిండారం దాల్చినట్టి నిస్త్రింశమునన్
ఖండించి రక్తధారా　　[తున్.
క్తుండగు నిను యమపురమునకుం బంపిం

[నిష్క్రమించిరి]

పంచమాంకము ముగిసెను.

---

షష్ఠాంకము

(పిదప వృద్ధతాపసులు ప్రవేశింతురు.)

ఇద్దఱు

రక్షింపుఁడయ్యా! రక్షింపుఁడయ్యా!

ప్రథముఁడు

ఉ. వల్లవొ! కల్వచాల్వలెన
  వల్లనివాఁ డెలదమ్మితూండ్లఁ జోల్
కెల్లనికోర్కెలన్ వగపు
  కెట్టలు వాఱెడు వాఁడు! వాఁడదే!
యల్లదె! రాత్రులన్ దిరుగు
  లాఁడెడు రక్కసిప్రేఁడు లేటి లేఁ
బిల్లను బోలె దాఁ బఱిథ
  వించి హరించెడు సీతఁగావరే!

ద్వితీయుఁడు

ఈమెంగదకే! మాతల్లి సీతాదేవి!

ఉ. చేపడి వైపుదప్పి కఱిఁ
  కెంది బునల్ గొను చిల్వచెల్వ నాఁ,
బ్రాఁ పెసఁ బాపి యూఁప వఱ
  రం కెదరం బసుపాఁవుఁదీవ నాఁ
తాపసవాటినుండి ఋషి
  ధర్మతపఃఫలసిద్ధిపోలె నీ
పాపి దశాస్యుచేత బల
  వంతముగా హరియింపఁగాఁ బడెన్

ఇద్దఱును

కాపాడుఁడయ్యా! కాపాడుఁడయ్యా!

ప్రథముఁడు

(ఊర్ధ్వమవలోకించి) అహా! పలుకు వెంటనే దశరథుని యప్పు దీర్చుకొనుటకుఁగా జటాయువు 'నేనుండఁగా నెక్కడికిరా పోయెదవు' అనుచు రావణుని గద్దించి యంతరిక్షమునకు నుఱికినాఁడు.

ద్వితీయుఁడు

వీఁడుగో! రావణుఁడు రోషముచే గ్రుడ్లుగిఱ్ఱనఁ దిరుగఁగా వెనుకకు మళ్లినాఁడు.

ప్రథముఁడు

వీఁడుగో రావణుఁడు!

ద్వితీయుఁడు

వీఁడుగో! జటాయువు.

ఇరువురును

అన్నా! ఇదిగో! అంతరిక్షమున సాగినది యుద్ధము.

ప్రథముఁడు

కాశ్యప! కాశ్యప! చూడు, పక్షిరాజ సామర్థ్యము.

స్రగ్ధర—
  చెక్కుల్ చెక్కించి ప్రత్యర్థిని సెదరదురై
    రేఁగి యూఁగించి పోరన్ [బెన్
  ముక్కుందోప్పన్ దదంగంబులు చెనకుచుఁ
    నుట్టిన్ జుట్టివచ్చున్ [లన్
  వ్రక్కల్ గా నుక్కు ముక్కై వఱలునఖము
    వ్రచ్చు వక్షంబు; దానన్
  జెక్కుల్ వజ్రాహతిన్ వ్రస్సినఁ బసుధరభ్రం
    జెట్టునన్ బోలె రాలన్.

ద్వితీయుఁడు

అయ్యో, సంక్రుద్ధుఁడై రావణుఁడు ఖడ్గముచేఁ బక్షీశ్వరుని దక్షిణాంగదేశమును నఱికెను!

ఇద్దరును

అయ్యయ్యో! మహనీయుఁడు జటాయువు పడి పోయెనుగదరా!

ప్రథముఁడు

అయ్యో! కష్టము! ఈమహనీయుఁడు, జటాయువు!

ఉ. ఆటకువచ్చు నెమ్మివలె
నారసె వైరిని, శక్తి మీఱితి పో
రాటము సల్పె నెంతకు భ
రంబగు నంతకు, దీప్తమైన సై
కాటుని తేజముట్టు గసిమ
సంగె, గజేంద్రము పెల్లగింపఁగా
నాటవి కద్రుమంబు పడు
నట్లు ధరాస్థలిఁగూలె నయ్యయో!

ఇద్దరును

ఈమహనీయునకు స్వర్గసుఖ మబ్బునుగాక!

ప్రథముఁడు

కాశ్యప! పోవుదమురమ్ము! ఈవృత్తాంతమును రాములవారికి విన్నవింతము.

ద్వితీయుఁడు

సరి! ముఖ్య మది!

[నిష్క్రమించిరి.]

ఇది విష్కంభము

(అంతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును)

ఎవరోయి యిక్కడ, కాంచన తోరణద్వారమును గాపాడువారు?

ప్రతీహారి

(ప్రవేశించి) అయ్యా! నేను విజయను. ఏమి చేయాలి.

కాంచుకీయుఁడు

విజయా! విన్నవించు, విన్నవించు, భరతకుమారునికి; "రామదర్శనార్థమై జనస్థానమునకు వెడలిన సుమంత్రులవారు వీరుగో తిరిగివచ్చినా"రని,

ప్రతీహారి

అయ్యా! సుమంత్రులవారు వెళ్లినపనిచేసుకు నేవచ్చినారా?

కాంచుకీయుఁడు

అమ్మా! నే నెఱుఁగను!

గీ. హృదయగతమైన శోకాగ్ని మొగయుఁదట్టె
నేమొకో! వారిమో మెంత యేని వాడె!
వచ్చినారు సుమంత్రులవారు; కాని
వారిఁ గనఁగనే నామది వ్యాకులపడె.

ప్రతీహారి

అయ్యా, ఇది వినేటప్పటికి నాహృదయము కొట్టుకొంటున్న ట్టున్నది!

కాంచుకీయుఁడు

అమ్మా! ఇప్పు డిక్కడ నెందు కాఁగెదవు? పోయి శీఘ్రముగా విన్నవింపుము.

ప్రతీహారి

అయ్యా! ఇదుగో వెళ్లి విన్నవించుకొంటాను.

(నిష్క్రమించును.)

కాంచుకీయుఁడు

(చూచి) ఓహో! ఇదిగో భరతకుమారులవారు సుమంత్రులవారు వచ్చిరన్న కుతూహలముచే హృదయ ముప్పొంగఁగా వల్కలోత్తరీయమునుగూడ వైచికొనకయే, చిత్రజటాపుంజ పింజరిత శిరస్కులై యిట్లె వచ్చుచున్నారు!

చ. సకలజగజ్జనప్రణుత
సద్గుణవర్గుఁడు సూర్యవంశదీ
పకుఁ డమరేంద్రసన్నిభుఁడు
వైరికులాంతకుఁ డన్న యాన ద
ప్పక సకలావనీవలయ
పాలనపుంబని పూనుకొన్న వాఁ
డకలుషుఁ డేన్గుగున్న వలె
నల్లదె మా భరతుండు వచ్చెడున్.

(అంత భరతుఁడు బ్రతీహారియుఁ బ్రవేశింతురు.)

భరతుఁడు

విజయా! అట్టులా? సుమంత్రులవారు విచ్చేసిరా?

గీ. ఆర్యదర్శనమునకు నే నరిగి తొలుతఁ
బడసి వచ్చితి శపథముల్ బాదుకలను
జనమనోబుద్ధి నయనరంజనుని రాము
మరలఁ గని వచ్చినారె సుమంత్రు లిపుడు.

కాంచుకీయుఁడు

(చేరఁబోయి) బాబుగారికి జయము.

భరతుఁడు

సుమంత్రులవా రిప్పు డెక్కడున్నారు?

కాంచుకీయుఁడు

వీరుగో! కాంచనతోరణద్వారమున.

భరతుఁడు

అట్లైని శీఘ్రముగాఁ దోడ్కొని రావలెను.

కాంచుకీయుఁడు

బాబుగారి సెలవుప్రకారము.

(నిష్క్రమించిరి.)

(అంతసుమంత్రుఁడుప్రతీహారియుఁ బ్రవేశింతురు)

సుమంత్రుఁడు

(సశోకముగా) కష్టమయ్యా! కష్టము!

ఉ. ఉంటిఁ నేన నృపాలసత్తముని మృ
త్యుప్రాప్తినాఁ డగ్గమై
కంటిఁ నేన నృపాలబాలకుల దుః
ఖప్రాప్తియుం బిమ్మటన్
వింటిఁ నేటికి నేన రాఘవునితో
వేర్పాటు భూపుత్త్రికి
ట్లుంటన్ సద్గుణమట్లు దోఁచియు జిరా
యుష్యంబు బాధించెడున్.

ప్రతీహారి

(సుమంత్రు నుద్దేశించి) విజయం చెయ్యండి! అయ్యా! ఇరుగో వేంచేసినవారు! సమ్ముఖానికి దయచేయండి!

సుమంత్రుఁడు

(చేరఁబోయి) బాబూ! జయము!

భరతుఁడు

నాయన, చూచితిరా మీరు లోకాతిక్రాంతమగు పితృస్నేహమును? చూచితిరా ద్విధాభూతమగు నరుంధతీచరిత్రమును? చూచితిరా నిష్కారణావహితవనవాసమగు సౌభ్రాత్రమును?

(సుమంత్రుఁడు చింతిలుచు నూరకుండును.)

ప్రతీహారి

బాబుగారుగదా! అయ్యగారిని అడుగుతున్నది?

సుమంత్రుఁడు

అమ్మా! ఏమి? నన్నా?

భరతుఁడు

(స్వగతము) ఆయాసము అధికముగానున్నది! సంతాపముచే భ్రష్టహృదయులుగా ఉన్నారు! (ప్రకాశము) నదిత్రోవనుండి తిరిగి వచ్చితిరా మీరు?

సుమంత్రుఁడు

నాయన! నీయానతిచొప్పున రామదర్శనార్థము జనస్థానమునకు వెడలినవాఁడను నదిత్రోవ నుండి యెట్లు తిరిగివత్తును?

భరతుఁడు

వారుకోపముచేఁ గాని, లజ్జచేఁ గాని మీకు సమ్ముఖము మీయలేదా యేమి?

సుమంత్రుఁడు

నాయనా!

గీ. కోపమేల వినీతులకును గలుగును?
లజ్జయేల స్థిరసత్వాంతులకుఁ గలుగును?
వార లచ్చట నాయనా! లేరు; నేను
శూన్యమగు తపోవనమునే చూచినాఁడ!

భరతుఁడు

అయితే వారెక్కడికి వెళ్లినట్లు వినవచ్చెను?

సుమంత్రుఁడు

కిష్కింధయని వానరనివాస దేశము గలదు గదా! అక్కడికి వెడలిరని వినవచ్చెను.

భరతుఁడు

అన్నా, వానరులు మానవుల తారతమ్య మర్యాదల నెఱుఁగనివారు గదా! ఇక్కట్లు పడుచు నక్కడ నివసించుచుందురు.

సుమంత్రుఁడు

నాయనా, తిర్యగ్జాతు లయినను వానరు లుప కారము నెఱిఁగి వర్తింతురు.

భరతుఁడు

నాయనా, అదియెట్లు?

సుమంత్రుఁడు

గీ. అన్నయగు వాలి రాజ్యమ్మునందు నుండి
బయలుపడిచి సుగ్రీవుని వెడలనడిచె
నాలిఁ గోల్పోయి పర్వతమందు నుండి
కావఁబడెఁ దుల్యదుఃఖుఁడుగాన యతఁడు.

భరతుఁడు

నాయనా, తుల్యదుఃఖుఁడంటి రే! అదియెట్టిది?

సుమంత్రుఁడు

(ఆత్మగతము) అయ్యో! అంతయును చెప్పి వేసితినే నేను! (ప్రకాశము) నాయనా! ఏమి యు లేదు. ఐశ్వర్యభ్రంశముచేత నగునమాన తను నేను బేర్కొంటిని.

భరతుఁడు

నాయనా, దాఁచుచుంటిరా? స్వర్గస్థులయిన మహారాజుగారి యడుగులతోడని యొట్టుపెట్టు చున్నాను. మీరు సత్యమును మఱుఁగుపఱు పరాదు.

సుమంత్రుఁడు

ఏమిగతి! వినుము.

గీ. మునిజనావనమునఁ బెనువైర మొదవెను
రామచంద్రునకును రావణునకు.
మాయఁ బూని దాన మాయమ్మ సీతమ్మ
నయ్యయో! హరించెనయ్య, వాఁడు.

భరతుఁడు

ఏమీ ! హరించెనా?

(మోహముఁ బొందును)

సుమంత్రుఁడు

ఊఱడిల్లుము ; ఊఱడిల్లుము.

భరతుఁడు

(ఊఱడిల్లి) అయ్యో ! కష్టము !

ఉ. చేరవలేరు బాంధవులు
చెందె దివంబునుగన్నతండ్రి, కాం
తారములందుఁ బెక్కులు వె
తల్ పడుచున్ వసియించుటాయె, నీ
తిరగు సంకటంబున స
తీవిరహంబును గల్గె, నార్యుఁ డ
య్యో! రహిఁ బాసె మబ్బు మాటుఁ
గొందిన చందురుమాడ్కి నిత్తటిన్.

అయ్యో! యిప్పుడేమి చేయుదును! కానీ! తెలిసికొన్నాను. నాయనా, మీరు నన్ను వెన్నాడుఁడు.

సుమంత్రుఁడు

బాబు సెలవుప్రకారము.

(ఇద్దరును బరిక్రమింతురు.)

సుమంత్రుఁడు

నాయనా, పోవలదు; పోవలదు. ఇది దేవేశుల చతుశ్శాల.

భరతుఁడు

ఆ ఇక్కడనే నాకుఁ బనికలదు. ఓ! ఎవరిక్కడ? ప్రతీహారీ !

ప్రతీహారి

(ప్రవేశించి) జయము బాబులుగారికి! నేను విజయను.

భరతుఁడు

విజయా ! నారాకను అమ్మగారికి తెలుపుము.

ప్రతీహారి

ఏ అమ్మగారికి తెలిపేది?

భరతుఁడు

నేను రాజుగావలెనని కోరుకొను నమ్మగారికి.

ప్రతీహారి

(ఆత్మగతము) అయ్యో ! ఏమిటో కదా! (ప్రకాశము) దొరా! చిత్తము!

[నిష్క్రమించెను]

(అంతఁ గైకేయి ప్రతీహారి వత్తురు)

కైకేయి

విజయా! నన్ను చూడడానికి భరతుఁడు వచ్చినాఁడా?

ప్రతీహారి

అమ్మా! అవును. మామబాబులుగారిదగ్గర నుంచి సుమంత్రులవారు వచ్చినారు. వారితో కూడా భరతబాబులు అమ్మగారిని దరిసించడానికి వచ్చి తమకో మనవిచేయుమన్నారు.

కైకేయి

(స్వగతము) అది ఏదో తుట్ట వెళ్లబెట్టి,నన్ను నిందించడానికి వచ్చినాడు భరతుడు.

ప్రతీహారి

అమ్మా, బాబులు రావచ్చునా?

కైకేయి

ఫో! తోడుకొనిరా!

ప్రతీహారి

అమ్మా! అట్లాగే. (పరిక్రమించిచూచి) జయము బాబులుగారికి! దయచెయ్యండి బాబులు!

భరతుఁడు

విజయా! ఏమి తెలిపితివా?

ప్రతీహారి

అహా! తెలిపినాను.

భరతుఁడు

అట్లయితే లోనికిఁ బోవుదము.

(ప్రవేశింతురు)

కైకేయి

బిడ్డా! విజయ చెప్పినది రాముని దగ్గరనుంచి సుమంత్రులు వచ్చినారని.

భరతుఁడు

అంతకంటె హెచ్చుముచ్చటను నివేదించుకొనుచున్నాఁడను మాయమ్మగారికి.

కైకేయి

బిడ్డా! ఏమి కౌసల్యను, సుమిత్రను కూడా పిలుతునా?

భరతుఁడు

వారు వినవలసినదిగాదమ్మా అది!

కైకేయి

(ఆత్మగతము) అమ్మా! ఏమిటోగదా యిది! (ప్రకాశము) చెప్పు నాయనా?

భరతుఁడు

వినుము;

గీ. అమ్మ, నీయనుజ్ఞ నాత్మరాజ్యంబు వ
　ర్జించి యడవులందుఁ జేరె నెవ్వఁ
　డతని భార్య సీత యపహృతయయ్యె; నిం
　డారెనమ్మ, నీమనోరథంబు!

కైకేయి

అమ్మో!

భరతుఁడు

గీ. అమ్మరొ! యున్నతమనస్సమంచితులకు
　సత్త్వమహితుల, కిక్ష్వాకుసంభవులకు
　డాపరించితివీవు గోడలవు తల్లి,
　కలిగెఁ గాంతాపహరణసంకటముగూడ!

కైకేయి

(ఆత్మగతము) కానీ! ఇదీ సమయము చెప్పడానికి; (ప్రకాశము) నాయనా! నీవు ఎరుగవా మహారాజులుంగారి శాపమును?

భరతుఁడు

ఏమీ! మహారాజుగారికి శాపము గలదా!

కైకేయి

(సుమంత్రునితో) అయ్యా! సవిస్తరముగా చెప్పండి!

సుమంత్రుఁడు

తమ సెలవుప్రకారము. నాయనా! వినుము. పూర్వము మహారాజుగారు వేఁటకు వెడలియుండఁగా నొక సరస్సునఁ గలశమును ముంచు ధ్వని వనగజబృంహితము వోలె వినవచ్చెను. అది వనగజబృంహితమే యనుకొని శబ్దవేధి శరముచే మహారాజులుగారు కొట్టిరి. కన్నులులేని యొక మహర్షిని గన్నుగాఁ గాపాడుచున్న కన్నకొడుకు కొకఁడు దానిచేఁ జంపఁబడెను.

భరతుఁడు

చంపఁబడెనా? పాపము! అయ్యో! పాపము! అపైన! అపైన!

సుమంత్రుఁడు

అంతనట్లు చనిపోయిన కొడుకును జూచి

గీ. సత్యభాషియైన సంయమి యాతఁ డ
ష్టేడ్చి యేడ్చి తుదకు నిట్టులనియె
ఓయి! నాకుఁ బోలె నుసు రుడుగును గాక
నీకుఁ గూడఁ బుత్త్ర శోకమున ని.

అని.

భరతుఁడు

అయ్యో! యిది యాపత్తుగదా?

కైకేయి

నాయనా! ఇట్టిస్థితి తటస్థించేటందు కామహర్షి శాపము నాపై అపరాధము మోపి చిరంజీవి శ్రీరాముణ్ణి అరణ్యవాసమునకు అంపినది. అంతేకాని నేను రాజ్యలోభము చేత చేసినపని గాదు. తప్పించుకోరాని దామహర్షి శాపము. పుత్త్ర విప్రవాసము సంభవించకపోతే నెర వేరదు.

భరతుఁడు

అయితే, పుత్త్ర విప్రవాసమంటివి; ఎవ రయినను సమానమేకదా! అరణ్యమునకు నన్నే యేల పంపకపోయితివి?

కైకేయి

నాయనా! మేనమామగారియింట్లో ఉన్నావు గావున నీవిప్రవాసము స్వాభావికముగానే ఏర్పడిఉన్నది.

భరతుఁడు

అయితే, పదునాలుగేండ్లని యీప్రవాసమునకు హద్దేలపెట్టవలెను?

కైకేయి

నాయనా! ఆబెడదలో నాగుండె దడదడలో మనసు చెదరిపోయింది. పదునాలుగునాళ్లు అనబోయిన నానోటినుండి పదునాలుగుయేళ్లు అని మాట జారింది.

భరతుఁడు

ఇందు బాగుగా ఆలోచింపవలసిన సంగతి సందర్భము లున్నవి. అయితే, ఇది గురుజనమున కెఱుకపడినదా?

సుమంత్రుఁడు

నాయనా! వసిష్ఠ వామదేవ ప్రభృతులు దీని నెఱుఁగుదురు. వారు దీనిని సమ్మతించిరి.

భరతుఁడు

అన్నా! వారు త్రైలోక్య సాక్షులుగదా! అబ్బా! మాయమ్మ యనపాధురాలు! అమ్మా! అన్నగారిమీఁది యధికభక్తిచే దున్సహాక్రోధమున నిన్ను దూషించితిని! నన్ను మన్నింపవలెను. దానివల్ల మఱచిపోవలెను. అమ్మా! అభివాదనము చేయుచున్నాఁడను.

కైకేయి

కన్నతల్లి యెవతె నాయనా, బిడ్డతప్పును మన్నించకుండ ఉండేది? లే, లెమ్ము; ఇందులో తప్పేమి ఉంది?

భరతుఁడు

అనుగృహీతుఁడను. అమ్మా, సెలవడుగుకొనుచున్నాఁడను. ఇప్పుడే నేను ఆర్యునకు

సాహాయ్యమరుగుటకై రాజమండలము నెల్ల సన్నాహపఱిచెదను.

ఇదిగో! ఇప్పుడే నేను!

గీ. సింధుతీరంబు మదసింధురాంధకారి
తంబు, సైన్యౌఘశిబిరవద్ధం బావర్తు
సాగరము రావణునితోడ సమముగాఁగ
గ్లానిఁ బొందింతు సైన్యలంఘనముచేత.

ప్రతీహారి

(ప్రవేశించి) జయము బాబుగారికి! ఈవృత్తాంతము విని పెద్దదొరసానిగారు మూర్ఛపోయినారు!

కైకేయి

అయ్యో!

భరతుఁడు

ఏమీ! మూర్ఛపోయినారా!

కైకేయి

రా, నాయనా, అమ్మను ఓదార్చుము.

భరతుఁడు

అమ్మగారి సెలవుప్రకారము.

[అందరు నిష్క్రమించిరి]

ఇది షష్ఠాంకము

---

సప్తమాంకము

(అంతఁ దాపసుఁడు ప్రవేశించును)

తాపసుఁడు

నందిలక! నందిలక!

నందిలకుఁడు

(ప్రవేశించి) అయ్యా! ఇదిగో ఉన్నాను.

తాపసుఁడు

నందిలక! కులపతులవారువిజ్ఞాపించుచున్నారు.

తాపసుఁడు

నందిలక! కులపతులవా రాజ్ఞాపించుచున్నారు. "స్వదారాపహర్తయు, త్రైలోక్య విద్రావణుఁడును నగు రావణుని నాశపఱిచి, రాక్షసగణవిరుద్ధవర్తనుఁడును, గుణగణవిభూషణుఁడును నగు విభీషణుని నభిషిక్తునిఁ జేసి దేవ దేవర్షి సిద్ధ విమలచారిత్ర యగు సీతాదేవిని దోడ్కొని ఋక్షరాక్షసవానరముఖ్యులతోఁ బరివృతుఁడై శ్రీరామచంద్రులవారు శరద్విమలచంద్రుని వలె నభిరాములై యిక్కడికిదె యరుదెంచినారు. కావున నిప్పుడీయాశ్రమపదమున మన విభవమునకుఁ దగినంతమట్టున నేవేవి సత్కారసన్నాహములు గావింపవలెనో యవియెల్లఁ గావింపవలసినది" అని

నందిలకుఁడు

అయ్యా! అంతా సిద్ధమయింది. కాని;

తాపసుఁడు

ఏమది?

నందిలకుఁడు

ఇక్కడ విభీషణసంబంధులు రాక్షసులుకూడా ఉన్నారుగదా! వారిభక్షణాలను గురించి కులపతులవారిసెలవేమో తెలుసుకోవలెను.

తాపసుఁడు

అది యెందుకు?

నందిలకుఁడు

వారికి కఱుకుట్లు మొదలయినవి కావలెగాదండీ!

చ. దివమునునుండి దేవి పరి
తృప్తిని జెందుము! కుందుమీదుమా!
భవదమలింతితంబయిన
ప్రాభవ మిప్డు లభించె నాకు, నే
నవని విభుండనైతి; నిఁక
నాఁకట సత్యవ్రతభారవాహినై
ప్రవిమలధర్మపద్ధతిని
పాలనసేయుదు నెల్లలోకముల్.

భరతుఁడు

మ. సమకూరెన్ నృపసంజ్ఞ, మా స్త్రీకమురు
ధ్వత్రంబు వెల్గొందె, మూ
ర్ధముపై దివ్యమణీకిరీట మొదవెన్,
రంజిల్లెఁ దిక్పాళికే
కము, లోకుల్ ప్రణమిల్లుచుండిరి, కళా
కాంతుల్ విజృంభించె, నే
ద్యుమణిజంత మ్యోదు నూత్నచంద్రునటుచూ
డంజాడ నాకార్యులన్.

శత్రుఘ్నుఁడు

క. చందురు పొడుపున నిల దెలి
వందినచందమున నార్య నభిషేకమునన్
గందెల్లఁ బాసె ముందట
యందతమ్మున నస్మదన్వయము శోభిల్లెన్.

రాముఁడు

వత్స, లక్ష్మణ, నేఁడు రాజ్యము నధిగమించితిని.

లక్ష్మణుఁడు

ఆర్యా! మా యదృష్టమున మీరిప్పటికి అల
రారుచున్నారు.

కాంచుకీయుఁడు

(ప్రవేశించి) జయము! మహారాజులుంగారికి!
[illegible] విభీషణులవారు విన్నవించుకొను
చున్నారు. సుగ్రీవ, నీల, మైంద జాంబవద్ధనూ
మత్ప్రముఖులుగూడ వెంటవచ్చుచు విన్న
వించుకొనుచున్నారు. 'మా యదృష్టమున
మీరిప్పటికి అలరారుచున్నారు' అని.

రాముఁడు

సహాయుల యనుగ్రహమున నలరారుచుంటి
నని వారికిఁ దెలుపుము.

కాంచుకీయుఁడు

మహారాజులుంగారి సెలవుప్రకారము.

కైకేయి

ధన్యురాల నయితినిగదా! ఈ యభ్యుదయ
మును అయోధ్యలోగూడ చూడఁగోరుచు
న్నాను.

రాముఁడు

అమ్మా! చూడఁగలవు. (చూచి) అహో!
ప్రభలచే నీవనమెల్ల భాస్వరముగ నున్నదివలె
వెలుఁగుచున్నది. (ఊహించి) ఆహా! తెలిసి
నది. మింటిపయికి రావణవిమానముగు పుష్ప
కము వచ్చినది. స్మరించినంతనే వచ్చునట్లే
వినానముతో నేర్పాటుగలదు. అయిన నిఁక
నందఱు నారోహింతురు గాక!

(అందఱు నారోహింతురు.)

రాముఁడు

గీ. ఇప్పుడే నే నయోధ్యకు నేఁగువాఁడ
బాంధవులు మిత్రులునుదోడ బలసిరాఁగ.

# నెల్లూరు తుపాను

౧. ఇండ్లు ధ్వంసమగుటచే ఆకులైన లేని చెట్లక్రింద నివసించుచున్న పేదజనము



౨. స్టోనుహౌసుపేటకు పోవు మార్గమున పూర్తిగా పడిపోయిన యిండ్లు

నెల్లూరు తుపాను



3. పెద్ద మార్కెటు



4. నెల్లూరునందున్న రోమనుకాథలిక్ చర్చి

లక్ష్మణుఁడు

కాంతుగావృత మిపుడె నాగరులు నిన్నుఁ
దారకాన్వితు నుదయచంద్రునిఁ బోలె.

భరతవాక్యము

గీ. సీతతోడ బంధుజాలంబుతోఁ బొంది
పౌసఁగి రాముఁ డుర్విఁ బ్రోచినట్లు
ప్రోచుఁగాత మాతృభూమిని లక్ష్మిన
మేలుఁడగుచు మామహీశ్వరుండు.

[ఎల్లరు నిష్క్రమింతురు.]

సప్తమాంకము ముగిసెను.

---

## పీఠిక

ఇప్పటి కించుమించుగాఁ బదునేడేండ్లకుఁ బూర్వము నే నీనాటకమును దెలిఁగించితిని. మన్మిత్రులు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రప్పుడు తిరువనంతపురమునఁ గార్యాంతరమునఁ గొన్నిమాసములు వసించి భాసనాటకములఁ గొన్నింటి నక్కడనుండి వ్రాసికొనివచ్చిరి. అప్పటి కింకను దిరువనంతపుర గ్రంథమాలలో నానాటకములు ముద్రితములు గాలేదు. ఆవ్రాఁతప్రతులను బట్టియే కవిగారు గొన్నినాటకములను దెలిఁగించిరి. నేను గొన్నింటిని దెలిఁగించితిని. పెద్దదగు నీ ప్రతిమానాటకమును నేనప్పుడు ముద్రింపఁ జాలనైతిని. తరువాతఁ దిరువనంతపుర రాజకీయ సంస్కృతగ్రంథమాలా సంపాదకులగు శ్రీగణపతిశాస్త్రిగారీ ప్రతిమానాటకమును రెండుమార్లు ప్రకటించిరి. రెండవతూరి స్వరచిత వ్యాఖ్యాసహితముగాఁ బ్రకటించిరి. నేనిప్పుడు దీనిని బ్రకటించుటలో నావ్యాఖ్యానము తోడ్పాటునుగూడఁ బడసితిని. రెండుమూఁడుచోట్లమాత్ర మీ వ్యాఖ్యానరీతిని, పాఠరీతిని, విడిచి తొలుత నాకుఁ దోఁచిన యర్థమును, నేను జూచిన వ్రాఁతప్రతిపాఠమును బాటించితిని. అవియే యనుగుణముగా నున్నవన్న నమ్మిక నాకుఁ గలదు. పెక్కుపట్టుల గణపతిశాస్త్రిగారి వ్యాఖ్య మిక్కిలి చక్కఁగా నున్నది. భాసనాటకములని గణపతిశాస్త్రిగారు ప్రకటించిన నాటకచక్రము భాసకృతము గాదని యిప్పుడు కొంద ఱుద్ఘోషించుచున్నారు. కాని యీయుద్ఘోషములు గణపతిశాస్త్రిగారు చెప్పినకారణములనెల్ల ఖండింపఁజాలినవిగా లేవు. రామాయణ, భారతకథలఁబట్టి భాసుఁడు రచించిన నాటకము లాతేఁడు, రామాయణ భారతకథలలోని యనౌచిత్యములను సంస్కరించుటకై యభిమానించి రచించినాఁడేమో యనందగినట్లున్నవి. ప్రస్తుతమయిన యీ ప్రతిమానాటకమున నట్టి సంస్కారములను బరికింపఁదగును. కైకేయీవృత్తమును, సీతావృత్తమును నిందుఁ జక్కఁగా పరిపుష్టపఱుపఁబడినవి. కైకేయికి దుర్బుద్ధి యీ నాటకరీతిని గానరాదు. సీత హిరణ్యమృగమును గోరుట గాని, లక్ష్మణుని నవాచ్యవచనము లాడుట గాని యిందుఁ గానరాదు. పంచమషష్ఠాంకములఁ జూచిన నీవిషయము తేటపడును.

ప్రథమాంకమున వల్కలకల్పనము, తృతీయాంకమున దశరథప్రతిమాకల్పనము

పంచమాంకమున దశరథ శ్రాద్ధకల్పనము నిందు పరిక్రాంతవిషయములు. ఇవి మిక్కిలి సరసములై, సంగతములైయున్నవి ప్రతిమానాటకరచనలు గొన్ని శాకుంతలనాటకరచనలో ననుకరింపఁబడినవి. తృతీయాంకమున రథవేగ వర్ణనము, పంచమాంకమున "కనుగందుగ" ఇత్యాది సీతావనస్థితివర్ణనలు, కాళిదాసుని శాకుంతల రథవేగవర్ణనమును, 'సరసిజమను విద్ధ' మిత్యాది శకుంతలావనస్థితి వర్ణనమును, జూడఁదగును. సీత చెట్లకు నీళ్లు పోయు చుండుటను వర్ణించు "సీ. ఆలవాలముల నిండార నురువ్వులువాఱ" అను పద్యము (పంచమాంకము) స్వభావోక్తి సౌభాగ్యముచే నెంతయు హృద్యముగా నున్నది.

నప్రయోజనముగాజరపిన సంస్కారము లుగాక వాల్మీకిరామాయణమునకును, నీనాటకమునకును భేదములు గొన్ని గానవచ్చుచున్నవి. అట్టి దొక్కటి. ఇందు, లక్ష్మణుఁడు పెద్దవాఁడుగాను, భరతుఁడు చిన్నవాఁడుగాను గానవగును. లక్ష్మణుఁడు భరతుని 'వత్స!' యని పిలుచును; ఆశీర్వదించును. భరతుఁడు లక్ష్మణునకు మ్రొక్కును; ఆర్య! యని పిలుచును. ఈ విషయము వాల్మీకిరామాయణమున సంశయగ్రస్తముగా నున్నది. బాలకాండలో:—"పుష్యేజాతస్తు భరతః— సార్పే జాతౌతు సౌమిత్రీ—" అని కలదు. భరతుఁడు పుష్యనక్షత్రమునను, లక్ష్మణశత్రుఘ్నులాశ్లేషానక్షత్రమునను జన్మించిరి. కావున భరతుఁడే జ్యేష్ఠుఁడగును. కాని, దీనికి విరుద్ధముగా లక్ష్మణుఁడే జ్యేష్ఠుఁ డగుననుటకుఁ గూడ సాధనములు గొన్ని రామాయణమునఁ గలవు. యుద్ధకాండమున ౧౨౦ వ సర్గము ౩౯ వ శ్లోకము:—

"తతో లక్ష్మణ మాసాద్య వైదేహీం చాభ్యవాదయత్, అభివాద్య తతః ప్రీతో భరతో నామచాఽబ్రవీత్" అని కలదు. సరశరీతిని జూడఁగా నిక్కడ భరతుఁడు లక్ష్మణుని, సీతను నమస్కరించిన ట్లర్థ మేర్పడును. ఇట్లు చెప్పిననే 'వైదేహీంచ' యనుట సమర్థమగును. జన్మకాలమునుబట్టి భరతజ్యైష్ఠ్యము ప్రవ్యక్తమగుచుండుటచే రామాయణవ్యాఖ్యాత లిక్కడ చిక్కుపడిరి. గోవిందరాజు "లక్ష్మణ మాసాద్య=కృతనమస్కారం లక్ష్మణమాలింగనేనసంభావ్య, ఇదంచలక్ష్మణస్యకనిష్ఠత్వాత్, లక్ష్మణేన చికీర్షితో నమస్కారో రామసన్నిధౌభరతేన ప్రతిషేధితః ఇతిచాహుః. వైదేహీంచాభ్యవాదయత్-చకారో రామనమస్కారం సముచ్చినోతి." అని వ్రాసెను. మఱియు నీతఁడు "సీతామాదాయగచ్ఛత్వమగ్రతో భరతాగ్రజ" అని స్థలాంతరమునఁ గల వాల్మీకిరామాయణప్రయోగము సరళరీతిని లక్ష్మణజ్యైష్ఠ్యమును జెప్పుచున్నను జన్మకాలరీతికివిరుద్ధమగుటచే,"భరతాగ్రజఇత్యత్ర బహువ్రీహిరిత్యుక్తమ్"అని క్లిష్టార్థము గల్పించెను. "ససంఖ్యే భరతానుజః" అని యింకొకచో భరతజ్యైష్ఠ్యవ్యంజకప్రయోగమునుగలదని గోవిందరాజు పేర్కొనెను. తిలకవ్యాఖ్యానమున 'తతో లక్ష్మణ మాసాద్య' యను శ్లోకమున లక్ష్మణునకు భరతుఁడు నమస్కరించినట్లే యర్థము చెప్పఁబడినది. కాని,

దాని నాతఁడు వేఱువిధమున సమర్థింపఁబోయెను.—"యద్యపి లక్ష్మణో భరతాత్కనిష్ఠో వయసా—స్పష్టంచేదం జన్మప్రకరణే. తథాఽపి జ్యేష్ఠానువర్తనేన స్వాపేక్షయా అధికగుణత్వేన స్వవ్యవహారేణ జ్యేష్ఠానువృత్తిరేవం కర్తవ్యేతి భరతం ప్రతి ఉపదేశదానేన చ గురుత్వబుద్ధ్యా తస్యనతి రుచితైవ" ఇది వైష్ణవసంప్రదాయరీతి నున్నది—పాయసప్రదానమునుబట్టి, వివాహమునుబట్టి, లక్ష్మణునకే జ్యైష్ఠ్యము గాననగును. గోవిందరాజు దీనిని జేర్కొని యది జన్మకాలరీతిచేఁ బరిహృతమయ్యె ననెను. అర్వాచీనులు పలువురు భరతజ్యైష్ఠ్యమునే యభిమానించినను, ప్రాచీనుఁడగు భాసునినాటలక్ష్మణజ్యైష్ఠ్యమే లక్షితమైన ట్లీనాటకమునుబట్టి తెలియనగును. లక్ష్మణజ్యైష్ఠ్యము వాల్మీకి సమ్మతముగాదని కూడ స్పష్టముగాఁ జెప్పఁజాలము.

భరతునివృత్తి మిందుఁ బరమోత్తమముగాఁ గాపాడఁబడినది - వాల్మీకులవారు గూడ భరతుని వృత్తమును బహుపవిత్రముగఁ జిత్రించిరి. ఈనాటకమున భరతోక్తి యెంతయు హృద్యము!—

"శా. పాపాత్ముండగు నేని.........దీఱుర్ణ"

(తృతీయాంకము)

'కొడుకుదుష్టుఁడేని ఘటశ్రాద్ధము చేసి వానికపుత్రత్వమును గల్పింపవచ్చును. వానికి దాయమీయనక్కఱలేదు. వానితో నాశౌచాది సంబంధముండదు. కాని, తల్లి యెంతదుష్టురాలైనను, నామె మాతృత్వముమాత్రము తొలఁగదు.' అని ధర్మశాస్త్ర నిర్ణయము గలదు. ఇతరదోషములున్నను మాతృత్వము తొలఁగకపోవచ్చునుగాని, యామె భర్తృద్రోహము చేయునేని యప్పుడు మాతృత్వము తప్పక తీఱిపోవలసినదేయని యాధర్మశాస్త్రమును భరతుఁడు సంస్కరింతుననుట హృద్యాతిహృద్యము! ఇట్టి విషయము లనేకము లిందుఁ గలవు. సరసులు గుర్తింపఁగలరు.

బహుకాలమునకు ముందే రచించినను మూలఁ బడవైచిన యీనాటకమును, మన్మిత్రులు, విద్వాంసులు, వినీతులు నగు శ్రీజయంతిపురము జమీందారుగారు వాసిరెడ్డి శ్రీదుర్గాసదాశివేశ్వర ప్రసాద బహద్దరుగారు ముద్రింపఁ బ్రోత్సాహపఱిచిరి. వారిచేఁ బ్రోత్సాహితుఁడను గానిచో నేనిప్పుడు దీనిని ముద్రింపఁబూనను. ప్రకటనమునకు బహురచనములు పయిపయి వచ్చుచున్నను, నప్రౌఢకృతమయినను నాయీనాటకమునందుకొని ప్రకటించిన భారతీపత్రికాధిపతులసాహాయ్యమును బ్రశంసించుకొనుచున్నాఁడను. మధురకవితారచనాప్రథితులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారుగూడ నీనాటకమును దెలిఁగించినట్టును, బ్రకటించినట్టును వింటిని. కాని దాని నే నింతవఱకుఁ జూడలేదు. ముద్రణమున దొరలిన దోషములను బుస్తకమున దిద్దితిని. గుణదోషవివేచనమునకు సహృదయులు ప్రమాణము.

మదరాసు
౨౮-౧౧-౨౪ } వేటూరి - ప్రభాకరశాస్త్రి.

# వివాహము

కావ్యతీర్థ బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గారు

ప్రస్తుతము 'ద్విజులకు యువతీవివాహము ముఖ్యమా? నగ్నికావివాహము ముఖ్యమా?' అనువిషయము విచారించవలసి వచ్చినది. దీనికై ముందుగా వివాహమనగా నేమో విచారించితే తత్త్వము తేలవచ్చును. ఇది స్మృతుల సహాయమున చేయవలసియున్నది.

వివాహ మనగా నేమి? వివాహ సామాన్యలక్షణము స్మృతిలో ఇదమిత్థమని ఎవరూ వ్రాయలేదు. యుక్తమయిన అర్థము తెలుసుకోవలెనంటే తర్కము వల్ల తెలియవలసి ఉంటుంది.

గౌతము—"న్యాయాధిగమే తర్కోఽభ్యుపాయః అనుమాన మభ్యుపాయః అభిధార్యేర్థానవాదీ" అని. కనుక పూర్వగ్రంథములనుబట్టి నిర్ణయించవలెను. మహాభాష్యంలో "కన్యాయాః కనీనచ" అనేసూత్రముక్రింద "కన్యాశబ్దోఽయం పుంసా అభిసంధిపూర్వకే సంప్రయోగేనివృత్తతే యా చేదానీం ప్రాగభిసంధాత్పుంసా సహ సంప్రయోగం గచ్ఛతి తస్యాం కన్యాశబ్దోవర్తతేఏవ. కన్యాయాః కన్యోక్తాయాః కన్యాభిమతాయాః సుదర్శనాయాః యదపత్యం సకానీనః" అని ఉన్నది. దీని కర్థము: కన్యా అనేపదము పురుషునితో అభిసంధిపూర్వకమైన సంప్రయోగము కలుగగానే మరిచెల్లదు. ఏకన్య ఇట్టి అభిసంధికి పూర్వమే పురుషునితో సంప్రయోగమును పొందిందో దానియందు కన్యాశబ్దము ఉండనేయున్నది...... దానికి పుట్టినవాడు కానీనుడు.

అయితే యిక్కడ అభిసంధి,సంప్రయోగ శబ్దాల కర్థం చెప్పవలసి ఉన్నది. కాళిదాసు కుమారసంభవమున "స్వర్గాభిసంధి సుకృతం వంచనామివ మేనిరే" అభిసంధి అనగా ఉద్దేశమని అర్థం. ఇట్లే మరికొన్నిచోట్ల "స్వర్గాభుజః కామ్యఫలాభిసంధా" అని ఉన్నది. వేదాంతశాస్త్రమున ఫలాభిసంధి రహితకర్మవల్ల జ్ఞానము కలుగును అన్నాడు. సంప్రయోగము: ఏపనివల్ల సంతానముగునో ఆపని.

ఇందులో మరొకమాట విచారించవలసి ఉన్నది. అభిసంధిపూర్వక సంప్రయోగముతో కన్యాత్వము పోవునన్నారు. ఆడవాళ్లుకూడా ఏవేవో కారణములచేతను ఆడపిల్లకు వివాహం ఆలస్యంగా అయినప్పుడు-"అమ్మా! ఇన్నాళ్లకు పిల్లకు కన్నెచెఱ వదలింది" అంటున్నారు. ఈవిషయంలో సందేహించేవారెవరూ ఉండరని నాననమ్మకము. అయినా పరాశరమాధవీయంలో 'లోకప్రసిద్ధస్తు కన్యాశబ్దో వివాహరహితస్త్రీమాత్ర మాచష్టే. ఏవం సతి శాస్త్రేషు బహవః కన్యాశబ్దా అనుగృహీతార్థవంతి' అనిన్ని, భారతంలో 'ఋతుస్నాతాతు యాశుద్ధా సాకన్యేత్యభిధీయతే' అని ఉదాహరించియున్నది. లోకంలో కన్యాశబ్దమునకు వివాహంకానిఆడది అని అర్థము. వివాహం కాగానే కన్యాత్వం పోతుందికదా! కనుక మీది భాష్యంలో ఎపుడు కన్యాత్వం నివర్తిస్తుందన్నారో? ఉద్దేశపూర్వకసంప్రయోగముతో. సరే, ఇది సిద్ధించడానికే నగ్నికా (రజస్వలకానిపిల్ల) వివాహాలలో మనమిప్పుడు సర్వే సర్వత్ర ముఖ్యమని అనుకొంటూ ఉన్నవాటిలో వివాహాది నాల్గవరాత్రి తెల్లవారుజామున శేషహోమానంతరం చేసే సమావేశంలో ఆలింగన రూపంగా మంత్రింపించుచున్నాము, అది 'స్మరణం కీర్తనం కేళిః' ఇత్యాది యెనిమిది విధములయిన మైథునములలో నొకటి కనుక. సరే; మహాభాష్యంలో (కన్యాత్వనివర్తక అభిసంధిపూర్వక) సంప్రయోగ శబ్దానికి మనమిప్పుడు చేయించుచున్న సంస్కారమే అర్థమా! అంతమాత్రంతో సంతానము కలుగుతుందా? కన్యాత్వము నివర్తించినదా? మఱిఅయితే కన్నెచెఱ విడిందని యేలాగనుకొంటున్నాము. సమావేశమంటే గృహ్యసూత్రభాష్యంలో 'మైథునార్థంశయనం' అనికూడా అర్థం వ్రాసినాడు. పోనీ, తర్వాత గర్భాధానం యథావిధిగా మళ్లాచేస్తున్నాముకదా అంటారేమో! కాదు. అదిముందు కలుగబోవు గర్భానికి సంస్కారముగాని వధూవరులకయ్యే వివాహ సంస్కారము కాజాలదు. మా

ఉండి దానిసంకల్పము:—'ప్రథమ గర్భసంస్కారద్వారా సర్వగర్భసంస్కారార్థం' అని. వధువు కెన్నిగర్భా లె క్కినా ఒకటేగర్భము. కనుక ఇక్కడ గర్భ మంటే కడుపులోనిపిల్ల 'గర్భః కుక్షిస్థ జంతౌ చ' అనిఘంటువు. ఋతుదినములు పదియారింటిలో చేయు నది గర్భాధానము. ఇతరకాలములలో చేయునది మైథు నమాత్రమే. దీనంతటివల్లను వివాహసామాన్యలక్షణము ఏమి చెప్పవలసి వచ్చెను? అభిసంధిపూర్వక సంప్రయో గము అని. అయితే యేయుద్దేశము? ఏయుద్దేశపూర్వక ముగా సంప్రయోగము చేస్తే వివాహము అనిపించుకుం టుందో అది. ఇదేలాగు తెలుస్తుంది గృహ్యసూత్రా లలో చెప్పిన సంకల్పమునుబట్టి. ఉద్దేశము, సంకల్పము పర్యాయపదాలే. ఏమని సంకల్పము? 'ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియముద్వహే' అని సూత్రం. దీని భాష్యం:—'ధర్మప్రజాసంపత్తిః—శ్రౌతేషు, గార్హ్యేషు, స్మార్తేషు చ కర్మసు శ్రద్ధార్థసిద్ధిః ధర్మసంపత్తిః; ప్రజా సంపత్తిః పుత్రత్వం' అని. దీనికర్థం:—శ్రౌతస్మార్తాది కర్మలలో శ్రద్ధార్థసిద్ధులు ధర్మసంపత్తిన్నీ, పుత్రవంతు డగుట ప్రజాసంపత్తిన్నీ. ఇందులో రెండుద్దేశా లున్నవి. ఇది యిలాగుండనిండు. ఈసూత్రం తర్వాత 'ధర్మ ప్రజాసంపన్నే దారే నాన్యాం కుర్వీత' అని ఉన్నది. దీనికర్థం:—మీద చెప్పిన ధర్మసంపద, ప్రజాసంపద. రెండూ మొదటి భార్యయందుంటే రెండో భార్యను పెండ్లాడకూడదని దానితర్వాత సూత్రంలో, 'అన్యత రాభావే కార్యా ప్రాక్' అని ఉన్నది. మీదచెప్పిన రెండు ఫలాలలో ఏదొక్కటి లేకపోయినా దానికోసమై మరొకతెను చేసుకోవచ్చును అంటే. ఆచేసుకో వడం కేవలం వివాహమేనా? దానికి సంకల్పం ఏలాగు చెప్పవలె? 'ధర్మసంపత్త్యర్థం స్త్రియముద్వహే' అనియా? 'ప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే' అనియా? అట్లు కాదు. పుత్రసంపదయుండి ధర్మసంపదకోసమే పెండ్లి ఆడవలసివచ్చిన భార్యతో సంప్రయోగముచేయడా? చేయరాదా? అలాగు శాస్త్రము నిషేధించునా? దానికి పుట్టినవారు తనకు పుత్రులనబడరా? కనుక వివాహమన గానే రెండుద్దేశాలు కలిపిన ఒక్కఉద్దేశమే ఉండక తీరదు. కనుక ఏవివాహంలోనైనా 'ధర్మప్రజాసంప త్త్యర్థ'మ్మనే రెండూకలిసే సంకల్పము. ఈసంకల్ప పూర్వక మయిన సంప్రయోగమంటే ఏమి? ఇదే వివా హము. ఇక్కడికింకా సంప్రయోగశబ్దార్థము స్పష్టపడ లేదు. వివాహా లష్టవిధము లన్నారు. అవి వివరించగా నన్నిటిలోనూ విశేషణభాగము వదలి విశేష్యభాగము సర్వసామాన్యంతీస్తే సంప్రయోగ శబ్దార్థమూ, దానితో వివాహలక్షణమూ కూడా తేలుతేనో చూతాము. ఏదైనా ఒకపదార్థంలో అనేకభేదములున్నను అన్ని టిలోనూ సామాన్యభాగ మొకటుండక తప్పదు. అట్లు లేకపోతే ఏకపదార్థంకాదు. అదేది? లక్షణాలు చూడండి. గౌతముడు (1) విద్యాచారిత్రబంధుశీలసం పన్నునకు కన్యనలంకరించియిచ్చుట—బ్రాహ్మము. (2) ఈ మెతోనే సహధర్మం చరించవలసినదని ఖరారుచేయిం చియిచ్చుట ప్రాజాపత్యం. (3) పెండ్లికూతుతండ్రికి రెండావులు మాత్రమే యిచ్చుట—ఆర్షము. (4) యజ్ఞం చేయించినవానికి దక్షిణాకాలంలో యజ్ఞవేదికలో కన్య నిచ్చుట—దైవము (5) వధూవరు లన్యోన్యేచ్ఛతో సంయోగించుట—గాంధర్వము. (6) కన్యతండ్రికి డబ్బిచ్చి కన్యను కొనితెచ్చుట—ఆసురము. (7) బలవంతముగా కన్యను తెచ్చుట—రాక్షసము. (8) కన్యను తెలియ కుండా (శరీరస్మృతిలేనపుడు) సంగమము చేయుట— పైశాచము. ఇందులో 1, 2, 4, (6-7)లో దానం ఉన్నది. అంతమాత్రంవల్ల వివాహసిద్ధయిందా? కా లేదు. ఇంటికి తెచ్చుకోవడం మాత్రంవల్ల వివాహసిద్ధ యిందా? కాలేదు. దీనితో మరొకదానిసంగతి తేలి పోయింది. గాంధర్వాలలోనూ, పైశాచాలలోనూ రహ స్యసంభోగము చెప్పినాడు. అది వివాహమయిందా? కాలేదా? కాలేదనలేము. చూడండి దేవలు—"గాంధ ర్వాదివివాహేషు పునర్వైవాహికో విధిః, కర్తవ్యశ్చ త్రి భిర్వర్ణైస్సమర్థేనాగ్నిసాక్షికః" అని. దీనిఅర్థం:— గాంధర్వాదివివాహాలలో తిరిగీ అగ్నిసాక్షికవివాహము మూడు వర్ణములవారు చేసుకోవాలె, అని. ఇక్కడ తిరిగి అనిన్నీ, మూడువర్ణములవారు అనిన్నీ ఏలన్నారు? తిరిగీ వివాహవిధి అనడంవల్ల అదివరకు వివాహం అయిం దనికాదా? మూడువర్ణములవారూ అనడంవల్ల నాలుగో వర్ణంవారికది అవసరం లేదుకదా! శూద్రులకు మొదటి

ఆవును నిజమేకాని రజస్వల అన్నాడు ఋతుమతి అన లేదు. శ్లోకాలు చూడండి. అష్టవర్షాభవేద్గౌరీనవ వర్షా తు రోహిణీ దశవర్షా భవేత్కన్యా అత ఊర్ధ్వం రజస్వలా' గౌరీం దదన్నాకపృష్ఠం-వైకుంఠం రోహిణీందదత్, కన్యాం దదద్బ్రహ్మలోకం రౌరవం తురజస్వలామ్" అని ఉన్నది. పదేళ్లు దాటితే రజస్వలే కదా! మరి మనువు "త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం" అన్నాడు. నరకంలో పడ మనేనా అతనిఅభిప్రాయం. లేకపోతే దానంలేని గాంధర్వాదులే చేసుకోమనియా? మరిన్నీ, 8, 9, 10 ఏళ్ల దానఫలము మాకక్కరలేదు. పిల్లలకు మక్కువ సుఖం గా ఉంటేనే అని ప్రత్యేకఫలం కోరుకొని దానం చేయ రాదా? ఫలం కోరకుండా కర్మలు చేస్తే ముక్తివస్తుం దని ఉపనిషత్సిద్ధాంతము కాదా? ఉత్తమమయిన ముక్తి దొరుకుతుందికదా! చేస్తే నరకం వస్తుందన్నాడే. ఏలా గంటారా! నరకంవచ్చే కాలంలో మానివేయండి. బాధ కమైంటే ఏలాగు చేస్తారు. యుక్తకాలంలోకూడా మైలలో పురుడులో వస్తే దానం చేస్తారా? అలాగే రజ స్వలాకాలం ముట్టరాదంటే దర్శనస్నానం చేసిన తర్వా తకూడా మరిముట్టరాదనేనా మీఅర్థాలు. 'ఋతుస్నా తాతు యాశుద్ధా పాకస్యైశ్వర్యభోక్త్రీయతే, అంటున్నాడే. ఎక్కడయినా ఋతుస్నానం చేసినదానిని దానం చేయ కూడదని వచనముంటే చూపెట్టండి, విచారింతాము. ఒకవేళ విశేషవచనముందంటారా? 'ప్రయచ్ఛే న్నగ్నికాం కన్యా మృతుకాలభయాత్పితా, ఋతుమత్యాంహితిష్ఠ న్త్యాం దోషః పితరమృచ్ఛతి" అనేది. ఋతుకాలంవచ్చి పోతుందేమో అను భయంవల్ల నగ్నికనే యిచ్చివేయ వలెను. ఋతుమతి అయి ఉండిపోతే తండ్రికి దోషము అనికదా అర్థము. దీనివల్ల ఋతుకాలం వచ్చిపోతుం దేమో అన్నభయంచేత ఇచ్చివేయండి. ఋతుకాలం వచ్చి యివ్వకపోతే దోషం వస్తుందని కాదూ తాత్పర్యం. ఋతుకాలంలో ఇస్తే దోషం చెప్పినాడా? ఇయ్య కుంటే దోషం చెప్పినాడా? ఇయ్యకుంటే దోషంచెప్పి నాడు. అయితే యిచ్చివేయండి. అందుచేతనే బోధా యనుడు 'అపివా గుణహీనాయ నోపరుంధ్యాద్రజస్వ లాం' అన్నాడు. 'గుణహీనునకైనా యిచ్చివేయండి. కాని రజస్వల అయినదానిని అడ్డకండి'అన్నాడుకదా! లేకపోతే 'నోపరుంధ్యా' త్తంటే ఉంచివేయకండి అనియా? అయితే ఉంచవద్దు. వద్దంటే ఏలాగుచేస్తారు? ఉంచకుంచేస్తారు? దీనిముందు ముక్క ఏమిటి? "దద్యా ద్గుణవతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే, అపివా గుణ హీనాయ"అని. గుణవంతుడైన బ్రహ్మచారికి రజస్వల కాని పిల్లను ఇవ్వవలెను. రజస్వల అయితే గుణహీనున కైనా యివ్వవలెను. "దద్యా" త్తన్నాడుగనుక అని అర్థ మంటారా? కానిండు. గుణహీనునకైనా రజస్వలను ఇమ్మన్నాడు. ఇస్తే నరకమనలేదు. మీరు మిక్కిలి నిషేధిస్తున్నారు. "నోపరుంధ్యా త్త"ంటే అడ్డవద్దు అని అర్థంచెప్తే ఆమె వివాహం చేసుకొనగోరినప్పుడా; ఒకరడిగవచ్చినప్పుడా? వివాహం చేసుకొంటానంటే గుణహీనునకైనా యిచ్చివేయండి. అడ్డవద్దు. అదిన్ని కంకా యివ్వ లేకుండా ఉండి అడుగవచ్చినవాడు గుణ హీనుడైతే మనువు చెప్పినట్లు "కామమా మరణా త్తి ష్ఠేత్...గుణహీనాయకర్హిచిత్."చచ్చేదాక ఇంట్లోనే ఉండవచ్చును. లిఙ్ లకారమున కెన్ని అర్థాలున్నవో చూ డండి. విధ్యర్థమొక్కటేకాదు. కనుక కన్యను ఇవ్వ వుంటే రజస్వలకానిదానికికూడా గుణవంతుడు వరుడు అడుగవస్తే దానం చెప్పబడియున్నది. రజస్వల అయితే ఇచ్ఛఉన్నప్పుడు గుణహీనునకైనా యివ్వవచ్చును. రజ స్వలకానిపిల్లకుకూడా మంచివరుడు కావలెనని యిచ్ఛ ఉండదా? తటస్థించినప్పుడు చేయవచ్చు. ఇంతెందుకూ, నిషేధాలన్ని దానాలకున్నాయి గాని వివాహానికి లేవు. కనుక ఫలం కావలెనంటే దానం చేసివేయండి. ఋతు మతి అయితేనేగాని వివాహమునకు ముఖ్యకాలము కాదు. కన్యాదానికి వివాహమంత్రాలలో మంత్రం లేదు. సమ్మిడికాయదానానికి చెప్పేమంత్రమూ,కన్యా దానమంత్రమూ ఒకటే. కనుక వివాహంలో భాగమిది కాదు. దానికి ఫలకము ప్రధానమని శాస్త్రజ్ఞులం టారూ? అయ్యా మనమిప్పుడు చేయుచున్నది ఏవివా హమో చిత్తగించండి! అర్షమా? అసురమా? వర్తనము ణ అసురానికీ అర్షానికే అవసరము. లేకుంటే బ్రాహ్మ దైవాదులకర్థం చెడుతుంది. ఆపస్తంబ గృహ్యసూత్రం చూడండి. అర్షమయితే రెండావులిస్తున్నారా? తత్త్వవి



# కోకిల

వైయాకరణశిరోమణి, వారణాశి గంగాధర శాస్త్రి గారు

కోకిలా! శ్రావ్యతరభవ త్కూజితమున
 నేమి పరమార్థ మున్నదో యెఱుఁగరాదు;
కాని- చెవిసోకినంత జగం బనంత
మోదరసపూరములలోన మునిఁగిపోవు.

అదిగో! స్వాతంత్ర్యపథము ప్రత్యగ్రభావ
భూషితంబైన యబ్దాది పుష్పరథము
నధివసించి ధరిత్రి వాహ్యాళి వెడలె
ఋతువిభుం డంచుఁ జాటింతు వేమొ నీవు!

యామినీవక్త్ర కుహూర ఘోరాంధకార
పటల నిర్మగ్న భుగ్న ప్రపంచమునకు
ధన్యతాధాయి చైతన్యదాయి రాక
పూర్వ మెఱిఁగించి మేలుకొల్పుదువొ యేమొ?

వచ్చుచున్నట్టి నూతనవత్సరమున
క్షేమ మరసి చరాచరజీవతతికి
సుఖముగూర్ప విశ్వేశు సంస్తుతి యొనర్చి
స్వస్తివాచక మేదైనఁ జదువుదువొకొ?

కలభవ త్కూజితధ్వాన చలితులగుచు
నెందఱో కవీంద్రు లింత సంతృప్తి లేక
నిన్నె మాటికి వర్ణించుచున్నవారు
పికమ, కూజితభావ్యంబు విప్పి చెప్పఁ.

---

చారాలో అపలాపం వద్దు. ఎక్కడికి త్తున్నారు? అయితే ఆసురమా! అందరూ ప్రస్తుతకాలంలో సొమ్ము పుచ్చుకుంటూనే చేస్తున్నారా? "ఏతచ్చవరక్షేమణాది ఆసురార్షయోరేవ నాన్యేషు అర్థలో పా" త్తున్నాడు ఆపస్తంబగృహ్యమాత్రభాష్యంలో. మనము చేస్తున్నదొకటి, చెప్పుమన్న దింకొకటి అనవలసి వస్తుందేమో దీన్ని బట్టి. మరొక్కమాట.

వివాహ కాలం మనువు, గౌతముడు, ఆపస్తంబుడు మొదలగువారు వివాహప్రకరణంలో చెప్పలేదేమా? దానము వివాహప్రకరణములో చెప్పక మరొకప్రకరణంలో ఏల చెప్పినారు? ఇంకెందుకూ వారి అభిప్రాయం ఇప్పటికి తేటతెల్లమయిందికదా! ఋతుమతీవివాహము ముఖ్యము. దానంచేయవచ్చును. నగ్నికావివాహము గౌణము. విధిలేనప్పుడు-అనగా మరి ఇంతకు ఉత్తమవరుడు దొరకనప్పుడని. దీనికెవరైనా ఋతుమతీవివాహము మానవలెనికాని, నగ్నికకే వివాహముచేసుకోవలెను అనిగాని వచనములు చూపిస్తే ఆపైని అభిప్రాయం మార్చుకొందునో; సమాధానముంటే చెప్పుదునో. దానక్లో కాలుమాత్రం వదిలిపెట్టండి; వివాహపర్యాయాలు గలకే ఇవండి.





# క్రొత్తపల్లి సూర్యారావు గారు

(వెనుకటిసంచిక తరువాయి)

ఒక్కనాఁడు మాతాయన చూడవచ్చినాఁడు. వియ్యంకు వచ్చి నన్నుఁ దమయింటికిఁ దీసికొని వెళ్లినాఁడు. పదిదినము లట్టిపెట్టుకొనినాఁడు-అక్కడ నిదియే గొడవ-వచ్చువారు, పోవువారు; వచ్చినమాదినవారింటికిఁ దిరుగఁ జూడఁబోవుట-మమ్ముఁ జూచి యానందించువారు, దీవించువారు. సుబ్బి పిన్ని గారియింటి కొక్కొక్కప్పుడు వెళ్లువారము. "బుద్ధిమంతుఁడు, అల్లుఁడు-మంచివారి కొక్కడ నున్నను గౌరవముగాఁ గడచిపోవును. శాస్త్రిగారికుమారుఁడు బుద్ధిమంతుఁడు కాఁడేమి" యని పలువు రానందించువారు. మాలచ్చి మగనితో నన్నుఁ జూడ వచ్చును. గౌరిని, శంకరుని, మీరు రావలసినది, మేము వెళ్లుచున్నా' మని యుత్తరము వ్రాసినది. వారిద్దఱు వీరిద్దఱు వచ్చినారు. నాల్గుదినము లున్నతర్వాత-మాయింటికి ముందురమ్మని మాయింటికి ముందు రమ్మని నన్నుఁగూర్చి-వారిద్దఱు పట్టుపట్టువారు. ఎవ్వరి మీఁద నెక్కుడు దయగలదో వారియింటికి నీవు ముందు వత్తువు అని వారు నన్ను మాటలాడనీకుండఁ జేయువారు. మీయిద్దఱుమీఁదను నాకు సమాన ప్రేమయే, సమాన దయయే-ఏక కాలమందు మీయిద్దఱియిండ్లకు నే నొక్కతె నెట్లు వత్తును. కాఁబట్టి మీరిరువురు నాయొద్దనేయుండుట మంచిదనియు, లేదా, మనమందఱము ముం దొక్కరింటికి వెళ్లి యక్కడ నాలుగునాళ్లుండి మఱి రెండవవారింటికి వెళ్లుదమని సమాధానము చెప్పితిని. అక్కయ్యా, నీకథలు విని, నీతో నుండి చాలనాళ్లయినది-అని లచ్చి, గౌరి మీఁదఁబడి ప్రాఁకువారు-"నేను వచ్చెద మీరెవ్వరే, మీకేమి చిత్తన మున్నదే నన్ను మీ యింటికి రమ్మనుటకు-మీమగ లూరకున్నారు. మీరు పిలిచిన నే నెట్లు వత్తును-మీ రొకరికేతెత్రించివారు-మీ మగలెక్కడికి రమ్మనిన నక్కడకు వత్తును-ఏమి లక్ష్మీనారాయణగారు! శంకరదీక్షితులు! మీయిద్దఱిలో నెవ్వరియింటికి ముందుగా రమ్మని రెదరు? అని వారివంకఁ జూచితిని. వా రొకరినొకరు చూచుకొని-యేమియు ననలేక, మీయిష్టము, మీ కెవ్వరియింటికి రావలయునని యున్న వారియింటికి రండనిరి. "మీరుమీరని మాటలాడుచున్నారు! మీరు "గురువుగారిని బట్టి మిమ్ము మేము గౌరవింపవలసినదే." "గురువుగారిని బట్టి గౌరవము చేయుట కధికారము నాకు లేదా-నే నిప్పటికి మీకుఁ గోపము వచ్చినను సరియే లచ్చి, గౌరీ యనియే పిలిచెదను." "అట్లే పిలువవలయును-మమ్ముఁ గూడ గౌరవింప నక్కఱ లేదు." "మఱి యెవ్వరియింటికి ముందు రమ్మందురో చెప్పరేమి" - "మాకుఁ దెలియదు, మామాటమీఁద రాఁదలఁచితిరా! మాయిద్దఱిలో మంచి వ్వారి నెఱుంగుదురో వారియింటికి ముందు వచ్చుట న్యాయము."

ఈమాటలలో లక్ష్మీనారాయణ మాయింటికి ఐదువుకొనవచ్చినవారిలో నొంటివాఁడగుటచే లచ్చితో

ముందు వెళ్ల నలసివచ్చినది-గౌరి, "అట్లుకాదు, దూరభారము లాలోచింపుము-ఎవ్వరియారు దూరముగా నున్నదో వారి యారు ముందు వచ్చుట న్యాయము-"లచ్చి-"మా యారు పిఠాపురముకంటె దగ్గఱ"యనిరెను. "ఎప్పుడు రమ్మని యుత్తరము వచ్చునో-వచ్చినతర్వాత తొందరపడవలయును-ముందొక్కసారి దగ్గఱయారు వెళ్లి-తర్వాత పిఠాపురము వెళ్లియుంటివా దారిలోనున్నదిగనుక పిఠాపురములోనే రైలెక్కి వెళ్లవచ్చు"నని మానాన్న తునితీర్పు చేసెను. అట్లే కావించితిని. వారివారి యిండ్లకడ, నాకువారుచేయుచున్న పనులు, చేయించి కొన్న నగలు, మొదలైనవి చెప్పిచూపి-కొన్నినాళ్లు నాకానందము గల్గించిరి. నాకన్నిటికంటె మిక్కిలిదైన యానందమే మనఁగాఁ దాముపెంచి పెండ్లిండ్లుచేసిన మేము ముగ్గురమిట్లుండుట చూచుటను మాతల్లిదండ్రు లింతకాలము జీవించియుండుట-నాకత్తమామలిద్దఱు, ఒక్కదానికత్తగారు, నొక్కదానికి మామగారును దీర్ఘాయుష్కులై యుండుట - లచ్చికొక్క కూఁతురు, మాకృష్ణవానికంటెఁ జిన్నది. గౌరి కొక్క కొడుకు, మాకృష్ణవానికంటెఁ బెద్దవాఁడు.

మావారు విశాఖపట్టనము వెళ్లినతర్వాత-వాత్రే రు లేమ కశోకర్యముగా నున్నదనియు-బరంపురము మార్పు చేయించికొంటిననియు-లక్ష్మీనారాయణనో దీక్షితుకో యిచ్చి తిన్నఁగాఁ పిఠాపురములో రైలెక్కించి బరంపురము పిల్లలను బంపవలసినదనియుఁ దండ్రిగారి పేర వ్రాసిరి. వారు మాతండ్రిగారి పేర వ్రాసిరి. మాతండ్రిగారు పిఠాపురము వ్రాసిరి. మేము ప్రయాణమగునప్పటికి-విసువఁజాలక, మానాన్నగారు, మామగారును విశా పురము వచ్చినారు. "మేము చూడఁబోయిన మసలివారము; నీవు చూడఁబోయిన జబ్బుదానవై పోయితివి. ఎట్లో తెలిపిచేసికొని దేశమునకువచ్చు నుపాయము చూచి కొనుండు. పోయిగా నున్నవారిని గదలిరమ్మనుచున్నామని మతిమొకలాగున భావింపవలదు" అని నాతోఁ బలికిరి. "జరుగనిండు కొన్నినాళ్లు: మాకెప్పు డిబ్బందిగానుండునో యప్పుడు రాసేవచ్చెదము - అక్కడ మన కెవ్వరున్నారు. నీవక్కడను వెళ్లి యుత్తరము వ్రాయుంచెద"నని నచ్చఁజెప్పి బరంపురము వెళ్లితిని.

బరంపురము మంచియూరే. మావారికిఁ గాకినాడ రాజమహేంద్రవరము. బంధువుల కూఁతుండ్రు, గోడండ్రు నక్కడ నున్నారు. వారి సంబంధమునుబట్టి నేనప్పుడప్పుడు వెళ్లి చూచుచుండుదానను. ఈయైదారుగెలలలో మాశాస్త్రి చదువు జెనుకఁబడినది. నా కారోగ్యముగాక యున్నది. ఏకో యింట వండి పెట్టి తినుచున్నదానను. కొందఱు యూలో వనమీఁద మావానిని పెద్దచదువులకని యత్నింపనే లేదు-చదువులలో శ్రమ-ఇప్పటివారికి గాఢముగాఁ జదివిన వస్త్రము పుట్టుటే. చదువులు భర్తింపవు. రైలుటిక్కెట్టులలోనేని నాలుగుముక్కలు మాటలాడుట-మణుగులు సేరులు, రూపాయలు అణాలు లెక్కలు కట్టుట-టక్కుటక్కుమని తీగటపా నడపుట - మనకుఱ్ఱవానికేష్టమనులోనయిన నిరువదిరూపాయలు దొరకక పోవునా యని యూహించితిమి. రైలుద్యోగము చక్కనిది. గౌరవమునకు గౌరవము-పోయికి పోయి-డబ్బునకు డబ్బు. ఇతరకార్యాలయములలోవలె నింతంత పక్షపాతము పెద్దవారిలోఁ దక్కువ. ఎవ్వరి పని వారు చేసికొనిపోవుటచే-కదుపులోని చల్ల కదలకుండఁ గూర్చుండుట సుపాయము.

మన మేమి దొడ్డ చదువులు చదివినారము. అన్నిష్టము చెప్పిచెప్పిరాదు. ఎక్కడు చదువు చదివి వీఁడు కలక్టరు కాఁబోవునా, మనము చూచెదమా! "అవశ్యం పితురాచారః" మన్నారు. నాలానున్న జాలునని మావారు నాతోఁ జెప్పిరి. అంతమాత్రిగ నిరక్షరకుక్షి గాఁడు - నాని ప్రాణమునకుఁ దగిన చదువువాఁడును జదువుచున్నాఁడు. చులుకైనవాఁడే. పాపము! చదువుచుచేయుచున్నాఁడు. అఁడుపిల్లలకుఁ జదువేమిటి యను వారిలోని దానసేనేను. చదువనఁగా నైదుబడులు, గుణితము, కాశికుక్కబొమ్మలు, పాఁపలిల్లుటు, బుట్టలు, కొట్టలు, కోలుకట్లు-నిదియా! దీనికై యాడతేలేన పంతులమ్మలు గావలయునఁట. ఒక్కముక్క వ్రాయలేరు. ఒక్క పద్యమున కర్థము చెప్పలేరు. దీనికై శిక్షితలైన పంతులమ్మ లేకాని బాలికలకుఁ జదువుచెప్పుటకు నాలుగు ముక్కలువచ్చిన మగవారు పనికిరారఁట - చదువుమాని యింటనేయుండిన దొక్కబాలిక-బియ్యము చేటలోఁ బోసి చెరుగలేదు. కడిగి వార్చ వెయ్యలేదు. చెంబులు తోమఁట చేతఁగాదు. బియ్యములోని బెడ్డ లేఱలేదు.

పంతులమ్మకే చేతఁగాదు. ఏబాలిక యింటికివచ్చి తన యింటికిఁ గావలసిన మేకోళ్ళన్నది. చాఁపలు నేసినది. బుట్టలల్లినది! "మహాజనో యేన గత స్సపంథా" అని - మాపిల్లమాత్రమె వెక్కసఁ బుట్టినది! అట్లే చదువుచున్నది. శాస్త్రమాత్రము కొంచెము దారిఁ బడినాఁడు. తల్లిదండ్రులింటియొద్దఁ జెప్పు చదువు గడచి పెద్దచదువులోనే పడినాఁడు. ఇప్పటి వానిపాఠములు లెక్కలు మాకర్థము కావు.

## పదునెనిమిదవయాంకురము

ఒకరింగాంచిన నౌకరి కసూయ యెండునుం డెలుసు-నాకుఁ బదిరూపాయలు జీతము, వానికిఁ బదేనేల యని.నాకంటె వాఁడేమి పెద్దయని-ఏమిబుద్ధిశాలియని ఏమిపనివాఁడని-యుండును. ఇదియొక చిత్రము. నేను దినమెల్ల వ్రాసిపెట్టిన కాగితములమీఁద నొక్కచేవ్రాలు చేయుట కీయనకింతజీత మేల యనువానికిఁ దనకంటెవానికెంత జాగ్రత్త యుండవలయునో యన్నది తానును దైవవశమున నంతవాఁ డగుదాఁక దెలియదు. సాధారణముగా యజమానునకుఁ గ్రిందివానిం బరీక్షింపవలయును, దప్పులు పట్టవలయుననియే యుండును. దొరకునెడకుండఁ దప్పుకోవలయునను నూహకో పాటు, మన మెట్లు తప్పు వ్రాసిననేమి దిద్దుకొనువాఁడుగదా యధికారి యనుదురూహ చాలమందికుండును. తన క్షేమైకఁ గాలిలోనుల్లు గ్రుచ్చుకొన్నను నది తనకష్టసుఖములెఱుఁగని యధికారిమూలమున నే వచ్చినదని భావించువారు కొందఱు. ఈ విషయమై యెత్తి చెప్పఁ దలఁచితినా యీయాంకురమంతయు తరమేకాదుగదా యీయానందకందమంతయు నగును- ఈక్రిందివింత వినిన మీకు లోకములో ననూయ యెన్ని విధములో-అందులో నిది యెన్నవదో గ్రహింపఁగలరు. మావారు సెలవుపుచ్చుకొన్నదే కాని మరలఁ బనిలోఁ బ్రవేశించినది యెఱుఁగని యొక్క తంత్రీవార్తానిర్వాహకుఁడు తనప్రక్కస్టేషనులోనున్న యింకొక టెలిగ్రాపు సిగ్నలరుకు, రైలు రాకపోకలు లేక చాలవ్యవధిగానున్న సమయములోఁ దంతి కొట్టినాఁడు. గ్రహచారవశమున నప్పుడు స్టేషనులో నతఁడు లేకుండుటయు, మావారుండుటయుఁ దటస్థించినది. అతఁడు గంగంగంట వాయించినాఁడు-చాలసేపెవ్వరును బలుకలేదు. మావారు పెళ్లి గదిలో నిలిచి యేమియని యడుగఁబోవునప్పటి
సిగ్నలరు వచ్చి-ఎవ్వరు ఏమని యడిగెను.

మొదటివాఁడు—(మావారి యుద్యోగములో
జెప్పి) పనిలోఁ బ్రవేశించినాఁడా (అనియడిగెను.)

రెండవవాఁడు—దగ్గఱనే మావారుండుటచేఁ
యివడఁకి-టిక్కుటిక్కుమని కొట్టుచుండఁగా-ఏమియు
యెవ్వరాయడుగువారని తామే యక్కడఁ గూర్చుండి
నీ కేమిపని వానితో-ఇంకను సెలవులోనే యున్నాఁడు
సెలవు పొడిగించుకొన్నాఁడఁట-నీవేమైనఁ జెప్పుకొనవ
సియున్నదాయని యడిగిరఁట-టెలిఫోనులోవలె నిం
కంఠధ్వని తెలియదుగదా! అందుచే, వాఁడు,-అతఁ
కష్టసుఖము లెఱుఁగని కఠినుఁడు, విద్యావంతుఁడు
గాఁడు. అదృష్టముకొలఁది నిట్టియధికారము వచ్చినది
అగత్యముచే మావంటివారిని బాధించుచున్నాఁడు: ము
ముగా నేవనిన నాతనికిఁ గోపము-నాకంటె వెనుక వచ్చి
వానికిఁ బెద్దపని యిప్పించినాఁడు, నన్ను మూలఁబడవై
నాఁడు. ఎవ్వరికిఁ జెప్పుకోవలసినను వీనిమూలమున
గదా పోవలయును; నేను వ్రాసికొన్న కాగితములన్ని
బుట్టలోఁ బడవేయును. అని తనయసూయ వెడ
గ్రక్కుకొనుచుండెను. నీవేమయిన నాకెపెట్టి చూడ
కపోయినావా! అని మావారు—

ఆతఁడట్టివాఁడైనయెడల నింతసేపా! దమ్మిడి
ట్టఁడు. అట్లయిన ఆలాగువచ్చినది యీలాగు వా
కర్పింతును. నా కెంతలేదన్నను జీతముకంటెఁ గొంచె
చ్చుగానే దొరకుచున్నది. పుచ్చుకొని యుపకారము
చేయు బుద్ధియు నాతనికి లేదు.

అని ప్రత్యుత్తరమిచ్చినతర్వాత, సరేలే, నా కిం
యొద్దఁ బనియున్నది. "శ్రీ అప్పు" వచ్చులోపల నే కొ
సారి యంగడికిఁ బోయి వచ్చెదను. వీలయినచో సాయ
కాలము నేను నిన్నుఁ గలసికొందునని మావారు మర్మత
గా నన్నిమాటలును, జ్ఞాపకముగ వ్రాసికొనిరి. అక్క
యుద్యోగితో, నీ పితనితో మైత్రిగలిగి యున్నాఁడవా
మీలో మీరిట్లు స్వవిషయములు చెప్పుకొనుచుందురా
ఈసంగతి నీవు వానికిఁ దెలిపినయెడల నీకుఁ జాలనష్టమ
గలుగును. జాగ్రత్తగా నుండుమని దెలిపించి ట్రాలీబం

కొంటిమి-తర్వాత బాలుల పర్ణగమనము, కుమారులు
పంపుకొనుట వింటిమి.

కాలమెుక్కరీతిగా నెవ్వరికిని గడువదు. మా
యిరువుర యత్తమామలు వృద్ధులైరి. మేము దూరస్థలమం
దుండుట వారి కెంతమాత్రము నిష్టము లేదు. రమ్మని
వ్రాయఁ దొడఁగిరి. ప్రమ్మకవడు రానన్నది. ముహూర్త
ములు లేవు. కుఱ్ఱవానికి వివాహము మా కన్నులతోఁ జూచి
యానందింపఁ గోరుచున్నారమని వ్రాసిరి. పెద్దలకో
ర్కె దీర్పకుండుట న్యాయము గాదు. వారి కెంతకాల ముం
దురు. ఎవ్వరు ముందో యెఱుంగరాదు. శుభస్య శీఘ్ర
మ్మన్నారని మరల మూఁడునెలలు సెలవుపెట్టి దేశము
నకు వచ్చితిమి. పెద్దవారియూహ లెప్పుడును పెద్ద
యూహలే-వీసంబంధము చేయవలయునని-చదువుకొన్న
వాఁడా! యుద్యోగియా! పట్టుమని యిరువదియేండ్లయి
న నున్నవా! ఎవ్వరు బిడ్డ నిచ్చెదరు! అని మే మాలోచిం
చుకొనుచునే వచ్చినారము. ఎన్నియో క్రొత్తయాలో
చనలు చేయుచుంటిమిగాని-ఒక్కనాఁడును మా కీయూ
హ తోఁపలేదు-వచ్చినతర్వాత క్రమముగా నెవ్వరియిం
టఁ బిల్లయున్నది. పెండ్లి చేయుట యెట్లని మా యత్తమా
మలనే యడిగితిని. వారియత్తమామలను వారును నడిగిరి.
పిచ్చివారా: వెదకికొన నేల! మనయింటనే యున్నారని
చెప్పిరి. అంతయును గూఢముగానుంచుకొనిరే మా కుత్తరము
వ్రాసియుండిరి. లచ్చిమాంబ యున్నదని చెప్పిరి. మనవా
నికి లచ్చిమాంబను జేసికొని, మనబిడ్డను గౌరికొడుకున కి
చ్చిన బాగుగా నుండును. రెండువివాహములు నొక్క
ముహూర్తముననే చేయవచ్చును. సంతోషమునకు సం
తోషము, సౌఖ్యమునకు సౌఖ్యము-మనవాండ్రు మనయిం
టనే యుందురు. డబ్బుకలిసివచ్చును. ఒడిలోనిబిడ్డ లొ
డిలోనే యుందురు. అనిన పెద్దవారిమాటలు విని కొండె
క్కినాము. లక్ష్మీనారాయణునకు దీక్షితునకు వ్రాసి
నాము. వారు వచ్చినారు. మాయూహ లిట్లున్నవని తెల్పి
నారము. వారు పరమానందము నొందిరి. ఎవ్వరిమట్టునకు
వారికిఁ గొంచెమో గొప్పయో కలదు. ఒక్కరిపై నొక్క
రాధారపడి యుండలేదు ఎవ్వ రేమేమి విశేషములు
చూపినను, అవి యొక్కొక్కవిశేషము క్రిందనే యుం
డును - అందఱమును తథాస్తనుకొన్నారము.

రెండు వివాహములును మాయింటనే జరుగవల
యునని మామామగారికి- మనుమరాలి వివాహము తమ
యింటఁ జరుగవలయునని మానాయనగారికి-మానాయన
గారి కన్నివిధముల మేనమామగారు సమానులే. లక్ష్మీ
నారాయణుఁడు శంకరదీక్షితులు నిరువురుశిష్యులు-
గురువుగా రెట్లు చెప్పినను దానికి మాఱుమాటయాడరు.
కాని లచ్చికిఁ దనయింటికి మమ్ముఁ దరలిరమ్మని చెప్ప
వలయునని యున్నది. గౌరికి మాయింటికిఁ దరలిరావలయు
ననియున్నది. ఎందుకైనను పెద్దలయిష్టమని సమాధాన
పడియున్నారు కావునఁ బెద్దలయానందమునకుఁగాను మా
యత్తవారియింటనే రెండు శుభకార్యములు జరుప నిశ్చ
యించినారు. శుభలేఖలు వ్రాసినారము. పందిళ్లు పాకలు
వేసినారు. రెండుకళ్యాణములు సలక్షణముగా జరిగినవి.
పెండ్లి వేడుకలన్నియు నెవ్వరెఱుంగనివి- వానివర్ణనము
విశేషముగ నలదు.

మూఁడు నెలల తరువాత, మరల నుద్యోగము
మాట తలఁపునకు వచ్చినది. నాయనా నేను వృద్ధుఁడను.
ఏవేళ కేమో, నీవు దూరదేశము వెళ్లుట నా కిష్టము లేదు.
నీవును జక్కఁగ నాలోచించుకొనుము- తర్వాత నీయి
ష్టము, నీపెండ్లమునిష్టము-ఆశకు వేఱయొక్కఁడ! ఇంత
వాఁడవు కమ్మని నేను కలలోను దలఁచుకొనలేదు. అయి
నను బ్రతుకుదు లోనికిఁ బోవును. మంచి ముడుఁగఁ గలదు.
దైవమింతవఱకుఁ గనఁబడుచెను. ఇప్పటికి రెండును సుఖు
లమై యున్నారము. అక్కడి మీయత్తమామలును, నా
కంటెఁ జిన్నవారే కాని వారును దిక్కుదియున పడిలోని
వారు. మీకింకను వడి మరల లేదు గావున నుద్యోగము
చేయవలయుననియే యుండును. మీతో మమ్ముఁ గొని
పోవలయునని యుండునుగాని యీతరుణావస్థలో మా
కుమాత్ర మిల్లువిడిచి పరస్థలములో నుండవలయునను
తలంపు లేదు. పుట్టిపెరిగినయిల్లు కట్టకడపట విడుచుటకు
మనస్కరింపదు. అని యెంతయో మా మామగారు కుమా
రునికిఁ బోధించిరి. వారికోరికకుఁ బ్రతిచెప్పఁజాలరైరి.
సరియే యట్లే కానిండు. నేనొక్కసారి వెళ్లి యధికారులను
జూచివచ్చెదను. అక్కడి వారితోఁ జెప్పి వ్యవహారము
ముగించుకొని రావలయును. అని తమరుమాత్రము వెళ్లి,
నేను బరిపాలించుకొందును. మాతల్లిదండ్రులు వృద్ధులు,

గృహకృత్యవ్యవహారములు చక్కఁగాఁగొన్ని తీర్చుకొన వలసియున్నది. అని యతికష్టముమీఁద వారిని సమ్మతి పఱిచికొనిరి. కంపెనీయధికారి పెద్దదొర నింటియొద్దఁ జూడఁబోయిరి. నీకుమారుఁ డేమిచేయుచున్నాఁడని దొరగా రడిగిరి. ఇంకను జదువుచున్నాఁడు, వాఁడెప్పటి కైన మీవాఁడేయని వీరు చెప్పిరి. ఇప్పుడే పంపరాదా యని దొరగారు కోరిరి. మా కేకపుత్రుఁడు, చిన్నతనము; దూరదేశములో విడిచియుండఁజాలము-పిమ్మట మీచిత్తము. అని వీరు వినయముగఁ జెప్పిన-భయములేదిక్కడఁ గొంతకాలముండవలయు. క్రమక్రమముగా దక్షిణ మహారాష్ట్రము కంపెనీవారికి వ్రాసి మీప్రాంతములోనే యుండునట్లు చేసెదను. అని సదయులై దొరగారు పలికిరి. మా శాస్త్రికిఁ గలకత్తాలో నుద్యోగము దొరకినది. అది దొరగారి సన్నిధికే-మేము మా పూర్వపరిచితులతో-భద్రముగా మావానిని జూచుచుండుఁడని చెప్పి, మహారాజ పెద్దదొరగారిచేతులోఁ బెట్టి వచ్చి యిక్కడ విశ్రాంతిఁ జెందియున్నారము. దొరలు, అందునను గొప్పయుద్యోగము గలవారు-వారికెవ్వరిపైనఁగాని విశ్వాసము కలిగినా యెన్నంటికిని దానికి భిన్నాభిప్రాయ ముండదు. తలంచుకొనిరా వానినెంతవానినైన జేయుదురు. మావాఁ డిక్కడఁ బ్రవేశించిన రెండేండ్లలో మూఁడుమెట్లెక్కినాఁడు. సదయహృదయులైన మాదొరగారును, మాపాలకులును, భగవంతుఁడును వానిని మమ్మునలెనే సదాకాలముల పాటు కటాక్షించుచుందురు. మే మిక్కడ వృద్ధసంసేవనమునఁ గాలము గడుపుచుందుము.



# సమర్పణము

శ్రీ వేంకటకాళిదాస కవులు

(ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము)

వికచ మృదునవ్య పద్మినీ విమల మధుర
మధు రసప్రాయ గాన సంపదలలోన
బొటబొటం గారు కన్నీటిబొట్ల మంచి
ముత్తియమ్ముల ప్రోవులు పొల్చునేమొ!
వాని నన్నింటిఁ బ్రేమసూత్రానఁ గ్రుచ్చి
దేవ దేవ! యీహారముం దీసికొనుము
లలిత జీవకళాసుధం జిలుకునట్టి
యమల గీతరహస్య భాగములలోనఁ
బ్రభలు వెలయించురత్నముల్ వరలునేమొ!
వానిలోపల స్ఫుటముగాఁ బ్రతిఫలించి
నీయనంతాద్భుతాకార నిచయమెల్లఁ
గనులకు వినోద మగునట్లు కనఁబరుపుము!
పరు లెఱుంగని యేకాంత భావ మొదవ
మాటిమాటికి నాపాడు పాటలోన
నెవ్వియుండిన నుండఁగా నిమ్ము నీవు
కైకొనిన నెవ్వి పూతము లాకపోవు?
విమలహృదయాన నీకు నర్పింతుఁ గానఁ
గోర్కెతో మంచి దంచుఁ గైకొమ్ము సామి!

—(ఏకాంత సంగీతము)



# ధర్మజునితో—భీముడు

మాగంటి రామకృష్ణ శాస్త్రి గారు

హాస్యమునకైన బరుల కెగ్గాడవైతి - నొచ్చియును శత్రుమదినైన నొంపవైతి
జ్ఞాతులిడు చెట్టలకు మారు సలుపవైతి- ధర్మజా, యిట్టిమూరట తగునె నీకు.

చ. విమతులు కౌరవుల్ కపటవృత్తులు; దండము లేమి జూచి మే
షము కఱవందలంచె ననుసామెత దోప, బ్రశాంతులైన మీా
శమము నెఱుంగజాలమి నశక్తులుగా మనలం దలంచి యా
కుమతులు గేలిసేయ, మనకుం దగవొక్కొ యుపేక్ష వారిపై.

చ. కక్ష వహించి కౌరవులు గర్వితులై మన కెగ్గొనర్ప, హా
ర్యక్షము మత్తకుంభినివహంబుల వ్రచ్చెడిలీల, శత్రులక్ష
శిక్షయొనర్పవేల? రిపుచెయ్యికి లోగెదు; బ్రాహ్మణుండవే?
భైక్షుకవృత్తి జీవనము పాడియె? రాచకొలంపుప్రోడకున్?

సీ. నీమూలమునగదా నెలతబన్నము జూచి - పెంపేద నొదలల్ వంపవలసె
నీమూలమునగదా నిఖిలశాత్రవకోటి - హాసియింప గానల కరుగవలసె
నీమూలమునగదా నిలువ నీడయు లేక - పరులపంచల జేరి బ్రదుకవలసె
నీమూలమునగదా నీరు నన్నము లేక - నీచతనాన చేజాచవలసె
నీదుమూలంబుననకాదె యాదురాత్ము - లిడినయగచాట్లకు ఫలంబు గుడుపలేని
బడుగులట్ల మనంబుల నడలవలసె - ధర్మపుత్రక! యిట్టి నీధర్మ మేల?

ఉ. జ్ఞాతులదుండగంబులకు సైపగరానిప రాభవాగ్ని మా
చేతములం దహించి ప్రతిసేతకు నిచ్చలు బ్రోత్సహింప, నే
నీతులొ పల్కి మమ్మణచునేరుపు జూపెదు; రాచపాడి యే
లా తలపోయవైతివి? బలా, యిది యెక్కడిశాంత మక్కటా!

ఉ. వంతల గూర్చినారు పగవా రనుచింత యొకింతయైన నీ
స్వాంతమునందు లేదు; రిపువర్గమహాంబుధి పొంగివచ్చినన్
శాంతము శాంత మంచు మము శాసనసేసె ది దేటివెఱ్ఱి, నీ
శాంతమె యింత తెచ్చె; రిపుసంహారనంబున కానలేయునే.

చ. మదకలకుంభి కంకుశము మాడ్కి సదా భవదాజ్ఞ నాకు, దు
ర్మదులగు కౌరవప్రతతి మార్గ్యాన బోవగ సంకిలయ్యె, మా
మదల యొకింత యీవిమత భూజము గుంకటివేరు త్రోడ నీ
యుదన చెళల్చి క్రోధతరుణాగ్నుల కాహుతి సేయకుందునే.

చ. భయదగదాభిఘాతముల వైరులరూ పడగించి వత్తు న
న్నయ! యన మీరలల్క వలదన్న సహించితి నేటిదన్క, నే
నయిపగ జాల నింక, బలశౌర్యములం బ్రకటించి యట్టి దు
ర్జయుల వధింపనేని సుజనాళి గణించునె నన్ను భీముగాన్?

ఉ. భీమరణంబునన్ విమతభీకరభూరిగదాభిరామ ప్రొ
ద్దామభుజావిలాసమున దర్పితశాత్రవరాజమస్తక
స్తోమము ఘోరశబ్దములతో ధర గూలగ జేయకున్న, నా
నామము భీముడే? రిపువినాశనహేతుగదం ధరింతునే?

చ. కదనము నీతి గాదని యఖండమనీషులు ద్రోణభీష్ములున్
విదురుడు బల్కు పల్కుల చెవిం జొరనీడటె? యాసుయోధనా
ధిపు వెస దర్పలంబు గుడిపింపక యీరక పుత్తునేని కో
విదులు ధరాధిపుల్ పుడమి భీమునిగా నను లెక్కసేతురే?

చ. నిరతము పాండుపుత్రులెడ నేరమె సల్పెడి యాతతాయి గా
వరమున గర్ణసౌబలుల బాహుమనోబలసిద్ధి నమ్మి, సం
గరమున నుబ్బి బొబ్బలిడు కౌరవనాథుని గూల్పనేని నన్
వరవిడి నారె భూజనులు? భీమునిగా నిక లెక్కసేతురే?

ఉ. కావున నావతిమ్ము త్రుటికాలములో గురురాజుబట్టి యా
కావరమెల్ల మాపి, తనకైతవకృత్యఫలంబులెల్ల నే
డీవిధిగా భుజింపుమని దేర్చడ దెల్పి పకేతరాట్పురిన్
నే వసియింపజేసి కడుపెంపున వచ్చెద ధర్మసంభవా!

---

# రోహిణీ సుధాకరము

గుళ్లపల్లి నారాయణమూర్తిగారు, యల్. యమ్. యస్.

౧

బహిష్కారము — ముఖ్యముగా న్యాయస్థానములు, ఆంగ్లేయవిద్యాశాలలు, విదేశవస్త్రములు — ఈ త్రికరణములే ఉత్కృష్టముగా ప్రబలిన సహాయనిరాకరణోద్యమమున ముందంజవైచి యుద్ధభూమి నుఱికినవారిలో కాకినాడ పట్టణవాసులకు ముఖ్యస్థాన మీయక తప్పదు. కాకినాడలో కాంగ్రెసు జరిగినందున కాకినాడ పేరు దేశదేశముల మ్రోగిపోయినది. శుద్ధఖద్దరువస్త్రములతో తయారయిన కాంగ్రెసుడేరా, ముద్దులు మూటగట్టు కాంగ్రెసు మంటపము, వివిధదేశములనుండివచ్చిన ప్రతినిధుల కేర్పాటయిన బసలు, ఆచార్యరేగారు వెలచిన ఖద్దరువస్త్ర ప్రదర్శనము, భక్త్యావేశము గలిగించు పతాకోత్సవము, ఇవి యన్నియు దర్శనమాత్రముననే దేశసేవాప్రాముఖ్యమును ప్రబోధించుచుండెను. స్వచ్ఛందసేవకులు విరామములేక తిరుగుచు ప్రతినిధులకు సదుపాయముల నొనర్చుచుండిరి. సరోజినీదేవ్యాది ప్రముఖురాండ్ర సన్నిధిని ఖద్దరువస్త్రధారిణులై యౌవనవతులగు స్వచ్ఛందసేవకురాండ్రొనర్చుసేవ ఆంధ్రదేశాభ్యుదయమును జాటుచుండెను.

సభాధ్యక్షు డగు మౌలానా మహమ్మదాలీగారి గుడారము తక్కిన బసలకంటె మిక్కిలి యలంకరింపబడెను. అందధ్యక్షుని నిమిత్తమొక స్వచ్ఛందసేవకుడును, వారి తల్లిగారి సేవనిమిత్తమొక సేవకురాలును నియమింపబడిరి. ఆసేవకుని కాసేవకురాలి నదివరకెచ్చటనో చూచినజ్ఞప్తి యుండెను. ఆమెయెవ్వతెయో తెలిసికొన నాతనికి కుతూహలము జనించెను. అత డామెవంక తదేకదృష్టి జూడసాగెను. ఆమె నడకలో ఘనత, ఆమె వాక్కున మార్దవము, జాగరూకత, చూపుల ముగ్ధత్వము, నడవడిలో వినయము, ఆహార్యమున దంభరాహిత్యము, ముఖారవిందమున విద్యాగంధము చాటగట్టుటచే నామె యొక నిరుపేదలయిన నిగర్వచూడామణులగు మర్యాదస్థులయింటబుట్టిన పడుచని చెప్పక చెప్పుచుండెను. ముఖమున గుంకుమధరించిన ట్లొకసారియైన నామె గోచరింపకపోవుటచే భర్తృహీనయై దుర్గతిజెంది భారతమాతృగర్భమున జిచ్చుపెట్టిన యువతీమణులయొక్క శతసహస్రసంఖ్యలో నామె చేరెనేమో యని సేవకు డూహించినను అధునిక నవనాగరికతావలంబనమున ననేకుల వలె

నామెయును తిలకధారణమును విసర్జించిన దేమో యనుసందేహము మాత్ర మాతనికి గలుగకపోలేదు. అప్పుడప్పు డితరసేవకురాండ్రామెను బిలిచిన పిలుపులబట్టి యామె పేరు రోహిణీ యని యాతడు గ్రహింపగలిగెను.

అధ్యక్షుడు తన తల్లియున్న గదిలోని కేగి. "వలంటియర్" అని పిలిచి యక్కడ నున్న కదళీఫలముల నొలిచి తన తల్లిగారి కిమ్మని సేవకురాలి నాజ్ఞాపించెను. పరధ్యానముగనున్న సేవకు డది విని యధ్యక్షుడు తన్ను బిలిచెనేమో యను నభిప్రాయమున నాగదిలోనికి బోవునప్పుడు నియమిత కార్య మొనర్ప గాజుపళ్లెరమును గడుగుటకు బయటికి దెచ్చుచున్న సేవకురా లాతని కెదురువచ్చెను. ఆయాతురతలో, ఆ కార్యోత్సాహములో, అప్రయత్నముగ, అనాలోచితముగ కేవలము పొరబాటున వారిరువురు నొకరినొకరు తాకిరి. పట్టితాకుటయే కాదు—ఢీకొనిరి. భార్యాభర్తలు కారు; చిరపరిచితులు కారు; ఒకనాడైన నొకరితో నొకరు సంభాషించిన వారు కారు. కేవలము పరులు; ఒకరితో నొకరి కెట్టిసంబంధమును లేనివారు. అట్టివారి దేహములు పరస్పరము ఢీకొన్నప్పుడు—నప్రయత్నముగ గానిండు, అప్రయత్నముగ గానిండు—ఫలిత మొకటే; జరిగినపని యొకటే; వారివారి మనోవీథుల సంచరించు భావము లెట్టివై యుండునో పాఠకులకు దుర్గ్రాహము కాదు. సేవకుని శరీరము పులకాంకితమైన దని యొప్పుకొనకతీరదు. కారణ మాతని మనోవిహాగము కొంతకాలమునుండి యామె పై నారిపారకు వ్రాలుచుండుటయే. సేవకు డాక్షణమునుండియు సిగ్గుపడుట కారంభించెను. పులకాంకితమైన యతనిశరీర మప్పుడే భయకంపితమైనది. ఆమెను దిరిగి చూచుట కాతనికి ధైర్యము చాలకపోయెను.

సభాకార్యక్రమము జరుగుచున్నప్పుడు గుడారముల సేవకులుతప్ప ప్రతినిధులు లేరు. కొందఱు సేవకులును గుడారములలో పనిలేదని సభావిశేషములు దెలిసికొనుటకు సభామంటపమునకు బోయియుండిరి. ఆసమయమున కాకినాడలోని యనాథశరణాలయాధికారి యాస్థలమునకు వచ్చి రోహిణిని బిలిచెను. రోహిణి యచ్చట లేదని తెలిసికొని సేవకుని జూచి యాతడు పలుకరించెను. "ఓహో, సుధాకరగుప్తగారా! కాకినాడలో చదువుకొని మీరు వెళ్లినప్పటినుండియు మీ దర్శనము మఱల కలుగలేదు. ఇప్పు డేమి చేయుచున్నారు?"

"మాతండ్రిగారికి రాజమహేంద్రవరమున ఖద్దరువర్తక మున్నది. నేను నాపనియే చూచుచున్నాను. ఈ రోహిణి యనే పిల్ల ఎవరు?" "ఈమె యొక అనాథబాలిక. చిన్నతనముననే తలిదండ్రులు నభర్తయును మరణించిరి. చాలకాలమునుండి యీమె మాయనాథశరణాలయముననే పెరుగుచున్నది. ఈమెకు తోడుగ నొకచెల్లె లున్నది. కడుపేదరాలు. ధనవంతులును, దేశసేవాపరాయణులును నగు మీవంటియుత్తములీమె కేదైన సద్గతిజూపలేరా?"

"నా కొక్కటే యుపాయము తోచుచున్నది. స్త్రీలలో ఖద్దరుప్రచారము జరుగుట

లేదు. ఈమె మాయూరు వచ్చి, మాదుకాణములోనిబట్టలను తీసుకొని స్త్రీలకమ్మినయెడల నాజీవనోపాధికి వలసిన రుసుము లభించును; ప్రచారమును జరుగును."

"మంచిది; నేనామెతో నాలోచించి పంపుదును; సెలవు."

ఈవార్తలు సుధాకరుని మనస్సముద్రము నందలియూహాతరంగముల సంచలనమునకు కారణమైనవి. ఈయనాథ బాలిక దురవస్థ కాతడు మిగుల బరితపింపసాగెను. ఇట్టియనాథలదుర్గతి తొలగకున్న దేశమునకు సౌభాగ్యమే లేదని యాతడూహించెను. "దయానందసరస్వతులు, కేశవచంద్రసేనులు, రాజా రామమోహనరాయలు, వీరేశలింగములు నెందఱుద్భవించి యెన్ని ప్రయత్నముల జేసిన నేమి? విధవావివాహములకు ప్రోత్సాహకరములగు నెన్నిచట్టముల మార్చిన నేమి? ఎన్ని స్త్రీపునర్వివాహములు చేసి దారిచూపిన నేమి? దేశ మింకను పెడత్రోవనే యున్నది. ప్రజ లింకను తమపుత్రికలదురవస్థను తిలకింపనేలేరు. మగని మొగమెఱుగని బాలికలు, సంసారసౌఖ్యమును జూరగొనుట కఱ్ఱులుచాపిన యబలలు, వివాహితలైన నెందఱో పీడలను, దేశభక్తిని కనగల మాతలు, పులుసును కారమును దినుచు మనసు పట్టలేక సంఘదూషణకు వెఱచి తమకోర్కెలను తామే దిగమ్రింగి కృశించి వివశలైన యువిదలు, ముండితకేశలై, అపవిత్రచిత్రవర్ణాంబరలై ఏకభుక్తలై, భూతలశయ్యాగతలై, పితృగృహమున బండపనికై పెరిగినదాసలై, మనోవృత్తికై యత్నవాలింటికడ వగచాట్ల బడుచు, శాశ్వతదుఃఖజీవినులై, శుభకార్యదూరగలై, నిండుయౌవనము శాఖోటకఫలప్రాయముగ జేసికొని, విధవలైయుండుట దేశమాత దురదృష్టము కాక వేఱేమనగలము? వరవిక్రయ మద్యపాన నిషేధములకు బాటుపడు సంస్కర్తలు తమదృష్టుల నీదిక్కున ప్రసరింపజేయనే లేదు. ఉపన్యాస వేదికలపై నుఱుము లుఱుమువారు తమవంతు వచ్చిన తగవు లేదని తప్పుకొనుచున్నారు. బ్రహ్మసమాజముపై మనసుకలిగిన మాన్యులు, ఇంటిలోని ముసలమ్మల యీసడింపులకు వెఱచుచున్నారు. వేదశాస్త్రపారంగతులు శ్రుతిస్మృతు లంగీకరించిన పునర్వివాహముల ప్రోత్సహించుటకుమాఱు శిష్టాచారములలో జిక్కుకొనినారు. దేశబలము క్షీణించుచున్నది. శిశుమరణము లతియ మగుచున్నవి. బాలవితంతువులసంఖ్య మీఱుచున్నది. వ్యభిచారదోషము ప్రబలుచున్నది. ఇంకను మనదేశమునకు ముక్తి యెక్కడ? ఈకాంగ్రెసుసందర్భమునన్నైన నిందువిషయమై తగుప్రయత్నములు జరుగునో లేదో." ఇట్టి తీవ్రమగునాలోచనములతో నిండినమనస్సుతో కాంగ్రెసున కనంతరము సుధాకరుడు రాజమహేంద్రవరము బయలుదేరెను. రోహిణీవిషయమై తానొనర్చిన సలహా కార్యరూపమును దాల్చునో లేదో యను బెంగ యాతనిమనస్సున నాటుకొనెను.

౨

కొంతకాలము గడచినది. రాజమహేంద్రవరమున నార్యాపురమున సుధాకరునివిప

జాలకుండెను. పైగా నతడు గర్జించి "నీచెల్లెలు బ్రతుకునో! చచ్చునో! నాలుగురోజులనుండి బట్టలే తీసుకొనిపోలేదు. రోజున కర్ధరూపా యరుసుము వచ్చునట్లు బట్ట లమ్మలేవుకాని, అయిదురూపాయిలు తీసుకొనివెళ్లి యప్పుతీర్చుదానవా? వ్యవహార మేడ్చినట్లే యున్నది. అప్పులేదు, సప్పులేదు; పొమ్ము! ఇంకను కదలవేమి?" యని కసరుటతోడనే యామె చేయునదిలేక భయకంపితయై, వెక్కి వెక్కి యేడ్చుచు, చెల్లెలిదురవస్థ తనకనులయెదుట తాండవమాడుచుండగా నాహాలు విడచి మెట్లు దిగిపోవుచుండెను. సుధాకరుడు తత్క్షణమే యామెవెనుక పోయి, తనవద్దనున్న



యైదురూపాయలకాగిత మామె కిచ్చి ధైర్యముగ నుండుమనియు, మరునాటియుదయమున తా నామెయింటికిపోయి కావలసిన సహాయ మొనర్తుననియు చెప్పి పంపెను.

సుధాకరుడు రోహిణికి ధనవిషయమున సహాయము చేయుట కిది మొదటిసారి కాదు. ఆమె యదివరకు సుధాకరుడిచ్చిన ధనమునం దించుకయు నుచితముగ గ్రహింపక తిర్చివేయుచుండెను. జననీజనకులు లేక, కట్టుకొన్నమగడులేక, తోడునీడయైన చెల్లెలును గతించుటకుసిద్ధముగనుండ నేకాకినిగ నీదుఃఖమయప్రపంచమున రోహిణిని నిలుపుటకు సృష్టికర్తయే కఠినహృదయుడై యున్నప్పుడు సుధాకరుడు తప్ప నింకెవ్వరు నామెకై విచారించువా రీలోకమున లేరని యామెకు దెలియును.

రాత్రి దుకాణమును మూసినపిదప సుధాకరుడు, నాతనిపినతండ్రియు భోజనముల ముగించిరి. వెంకట్రామయ్యకు సంతతిలేకపోవుటచే సుధాకరుడే యాతనియాస్తికి వారసుడైనను దయాసముద్రుడగు సుధాకరుడు పినతండ్రి లోభత్వాదిక్రూరబుద్ధుల కాతని నసహ్యించుకొనుచునేయుండెను. అసహాయోద్యమము నాధారముగ జేసుకొని వేలకొలది ఆర్జించిన పినతండ్రియింట నుండి, అస్వతంత్రుడై గంగిరెద్దువలె నాతనివాద్యములకు శిరఃకంపన మొనర్చుచుండుటకు సుధాకరునికి కష్టముగ దోచుచుండెను. రోహిణిపట్ల దయారసముతో నిండిన యాతని హృదయము పినతండ్రియెడ నాదినమున క్రోధరసపూరితమై పోయెను. అదివరకు నోరెత్తియెఱుగని సుధాకరుని కాదినమున పినతండ్రి నెదిరించుటకు విపరీతమైన ధైర్యము కలిగెను. భోజనానంతరము

వీథియరుగుపై చతికిలబడి చుట్టకాల్చుచుండిన వెంకట్రామయ్యవద్దకు సుధాకరుడు చేరి:

"ఆమెకు మధ్యాహ్నము నాలుగురూపాయలిచ్చిన నామె సంతోషించియుండదా? పాప మామెచెల్లెలి కెట్లున్నదో!" అనెను.

"నాలుగురూపాయలు! నాలుగురూపాయలు! ఎంత చులకనగా నున్నది. వ్యవహారము చేసినవారికిగాని డబ్బువిలువ తెలియదు. నీకేమి పోయినది? నీకు రూపాయలనిన చిల్లిగవ్వలయిన కావు."

"నాకు డబ్బువిలువ తెలియునుకాని మనిషిపుట్టుక పుట్టినవారికి దయాదాక్షిణ్యములుండవలెను. ఇంతకు నామె యప్పడిగినది; ధర్మమున కడుగలేదే."

"నాకు దయాదాక్షిణ్యములు లేవయ్యా; నేను మనిషిని కాననుకొంటివా? దున్నపోతు ననుకొంటివా! గాడిద ననుకొంటివా! నోటికి వచ్చినట్లును ప్రేలుచున్నావు! నీ కాపిల్లమీద మనసున్నది కాబోలును. నీవద్ద నున్నదో నామె కిచ్చుకొనరాదా."

"ప్రొద్దుట విక్రయించిన వస్త్రముల రాబడిలో నైదురూపాయ లామెకు ధర్మముచేసితిని. ఆమెపై నాకు మనసున్నమాట సత్యమే. కాకినాడకాంగ్రెసుకు వెళ్లినపుడే నా కామెపై ప్రేమ మంకురించెను. లోకములో 'నా' అన్నవారు లేక తెక్కులకష్టముల నామె జీవించుట చూచినప్పటినుండియు నాప్రేమ బలపడినది. త్వరలో నామె నంగీకరించినచో నామెను వివాహమాడి నాయుద్దేశములను సార్థకపఱచుకొనను నిశ్చయించుకొంటిని."

"సంతోషమే! నీకును వినాశకాలము వచ్చినది. వినాశకాలము రాబట్టే విపరీతబుద్ధులును పుట్టుచున్నవి. నిన్నింతను పెంచి పెద్దవానినిచేసి, పెండ్లిచేసి నాయాస్తి నప్పగింత మనుకొనుచుంటిని. నీ వింక పనికిరావు. పొమ్ము! పోయి దానిచెల్లెలితో పాటు నీవును చావుము." సుధాకరుడు మాఱుమాటాడిక నదే పదివేలని యరుగు దిగి పోవుచుండెను. "ఓరీ సుద్దయ్యా! చేతులనున్న మురుగులు, నుంగరములు నిక్కడ పెట్టి మఱీ చావుము" అను వెంకటరామయ్య కేకలకు మాఱుపలుకక సుధాకరు డానిశీథమున బయలుదేరిపోయెను.

## 3

సుధాకరు డెన్నియో వీథులం దిరిగి తుదక వీథినున్న రోహిణిగృహమును కనుగొనగలిగెను. అతఁ డాయింటి కదివర కెన్నడును పోయియుండలేదు. ఆయింట నొక్కటే గదియుండెను. అందెవరో యొరువిచ్చిన యొక నులకమంచముపై ధవళవస్త్రసంఛాదితముగు రోహిణిచెల్లెలి మృతకళేబరము హృదయము భేదించునట్లగుపడుచుండెను. శవజాగరణము చేసి దుఃఖించి దుఃఖించి తుద కూరకొన్న రోహిణి యామంచమువద్ద నసహాయురాలై దీనవదనముతో కూర్చొనియుండెను. సుధాకరు డాయింట ప్రవేశించునప్పటికి తెల్లవారుచుండెను. అతఁడింట నడుగుపెట్టగనే రోహిణి వెక్కివెక్కి యేడువసాగెను. సుధాకరుడామె

నోదార్చి గతరాత్రి తనయాభరణముల దాకట్టిపెట్టి తెచ్చిన నూఱురూపాయలలో నిరువదిరూపాయలు ఖర్చుచేసి వాహకుల సమ



“రోహిణి శవంపమువద్ద......కూర్చునియుండెను.”

కూర్చి రోహిణి చెల్లెలికి దహనసంస్కారమును జరిపించి పుణ్యము కట్టుకొనెను. ఆ సాయంకాలము సుధాకరుడు తిరిగివచ్చి రోహిణికి ధైర్యము చెప్పి తాను బసచేసిన మిత్రుని యింటికి బోయెను. మఱునాటియుదయమున నట్లే సుధాకరుడు రోహిణియింటికి వచ్చెను గాని యచ్చట నెవ్వరు నగపడలేదు. ఆచిన్న యిల్లు నిర్మానుష్యమై యుండెను. రోహిణీ జాడ లెవ్వరు నాతనికి చెప్పజాలకపోయిరి. శ్రీరామనవమి సమీపించుచుంటచే సోదరీ వియోగమును భరింపజాలక మనసుకు కూఱట కలిగించుకొనుటకు భద్రాచలమున కామె ప్రయాణమైయుండవచ్చునని సుధాకరు డూహించెను.

౪

ఆతెల్లవారుజామున రాజమహేంద్రవరపురేవునుండి పడవలు భద్రాచలమునకు బయలుదేరెను. ప్రయాణికు లసంఖ్యాకులు భద్రగిరికి బయలుదేరిరి. భిక్షుకుల యార్తనాదములు మిన్నుముట్టెను. పుస్తకవిక్రేతలు క్రొత్తపంచాంగముల నమ్మిరి. సూర్యోదయసమయమున పడవపై నొకచిన్న మూటను దగ్గఱనుంచుకొని దుఃఖభరమున నొకమూల గూర్చొనియున్న రోహిణి చుట్టును గొందఱు స్త్రీలు చేరి యామె విచారకారణ మెఱింగి యామె నోదార్చుచుండిరి.

భద్రాచలమున నుత్సవసమయమున ఖద్దరువిక్రయించి లాభమును పొందుటకాపడవలోనే ప్రయాణముచేయుచు నంతదనుక నేమూలనో నిద్రించుచుండిన వెంకటరామయ్య యిప్పుడే పడవపైకి వచ్చి రోహిణియెదుట నిలచి, “ఇదిగో! నీ వెక్కడికి? భద్రాచలమే? నీచెల్లెలి కేలాగున్నది? మాదార్భాగ్యు డేడీ? నీవద్దకే బయలుదేరినాడే” యని పల్కిన శ్రుతికఠోరములగు ప్రశ్నములకు రోహిణి బదులుచెప్పలేదు.

“ఆమె నేమి ప్రశ్నించి చంపెదవయ్యా! ఆమెచెల్లెలు పోయినదట! ఏకనాదముగ నేడ్చుచున్నది. పోలవరము రేవులో మేము వండుకొని యామె కింత పెట్టగా నొక్క మెతుకైన నోటబెట్టలేదు.” అని కొందఱుస్త్రీలు చెప్పగా నాత డాస్థలమునువీడి యేమో పద్దులజూచుకొనుచు నాపడవయం చున గూర్చొనియుండెను.

క్రమముగ పాపికొండలు సమీపించినవి. అచ్చట గోదావరి సన్నమై మెలికలబడి నూఱుగజములకంటె నెక్కువ వెడల్పులేక కొండలమధ్య ప్రవహించుచున్నది. పడవ కెదురుగ రెండుపడవలు వచ్చుచుండెను. పడవవాండ్రు జాగ్రతగా నుండుమని ప్రయాణీకుల హెచ్చరించుచుండిరి. ప్రయాణికులందఱును ప్రాణములు పిడికిట పట్టుకొని యుండిరి. పడవయంచున కూర్చొనియున్న వెంకటరామయ్య లేచి భద్రముగనుండు స్థలమునకు పోవ యత్నించెను. "ఇప్పుడందఱును గలిబిలి చేయకయ్యా, బాబూ, భయము లేదు; జాగ్రతగానే దాటిస్తాము" అని పడవవాండ్రాతని వారించిరి. ఆనదీగర్భమున నొకపెద్దమడుగుండెను. అట్టిసుడిగుండము లనేకము లాస్థలమున గలవు. పడవ సుడిలో బడి గిఱ్ఱున దిరిగి వడితో నొకమెట్టను డీకొనెను. పడవయంచున గూర్చొనియుండిన వెంకటరామయ్యయు నాతాకుడుకు తూలిపోయి నీట బడుట సంభవించెను. పడవ మెల్లగ సుడిలోనుండి తప్పుకొని మంచిమార్గమున బడెను.

"అయ్యో భగవంతుడా, దిక్కు మొక్కు లేని నాకైనను జావు పెట్టక శ్రీమంతుడగు నాతని కీదుస్స్థితికల్పించితివేమి?" యని రోహిణి చింతించెను. పల్లెవాండ్రిరువురు నీట గంతివెంకటరామయ్యను బహుప్రయాసతో నొడ్డునకు జేర్చిరి. అతనిచుట్టును తాటియాకులమంట వేసి కడుపుపైనను, గుండెలమీదను నొక్కగా కొంతసేపటికి వెంకటరామయ్య స్పృహవచ్చి కనుల దెఱచెను. నలుగురుపడవవాండ్రాతని నెత్తి దగ్గఱనున్న పల్లెవాండ్ర గుడిసెలోనికి దీసికొనిపోయి సమీపముననున్న యొకపల్లెవానియింట నొక కుక్కిమంచము దెచ్చి యందుపై నాతని శయనింపజేసిరి. రోహిణి దీనావస్థలో పరుసములాడిన వెంకటరామయ్య కీలోకమున తత్ఫాపఫలము ననుభవించుట కీశ్వరు డొసర్చిన శిక్షయదియే కాబోలు. రోహిణి సహజౌదార్యముతో పడవ దిగి వెంకటరామయ్యతో గుడిసెలోనికి బోయి యాతనిప్రక్కనే యుండి యాతని నుపచరించుచుండెను. అతడు నోరు తెఱచినపుడెల్ల గోదావరీజల మాతనినోట నామె పోయుచుండెను.

వెంకటరామయ్య రోహిణిని చూచెను. ఆవెంటనే యాతని కనివార్యమగు దుఃఖముదయించెను. పరిపక్వమైనపాపము పశ్చాత్తాపముగమాఱెను. గద్గదస్వరమున, నెడలేనికన్నీరు కాలువలుగట్ట నాయాసముతో నాతడు రోహిణిహస్తమును బట్టుకొని యిట్లు చెప్పసాగెను:

"అమ్మా! నీవేనా! తల్లీ నీవే! - నాకాయాస మగుచున్నది. ఇక నేను బ్రతుకను— నేను—బ్రతుకుట—వట్టిది. నాకు—ఒక—ఒక— ఇక్క డెవరున్నారు తల్లీ"—

"ఎవరును లేరు చెప్పండి" అని రోహిణి బదులుచెప్పెను.

"నాకు-ఒకలక్ష—రొక్కము - ఆస్తి ఉన్నది-ఇల్లు ఉన్నది—నాభార్యకు సగము- నీకు సగము-నేను బ్రతుకను-అంత్యదశలో

కలో-ఉపచారము చేసినావు-నాకు నీవే-కొడుకువు—కాగితం - కలం—వీలు-పడి".

పడవనుండి దిగిన యొకయుదారపురుషుడు కాగితమునకు, కలమునకు ప్రయత్నించెను కాని లభించ లేదు. రోహిణి వెంటనే తనమూట విప్పి యందున్న రాట్నపుకదురును తీసి యా గుడిసెపంచనున్న క్రొత్తతాటియాకు చింపి పడవ దిగివచ్చిన పురుషుని కీయగా నాతడు వెంకటరామయ్యకోరిక ననుసరించి మరణ శాసనమును లిఖించెను. రోహిణి సుధాకరుని పేర మరణశాసనమును వ్రాయింపుమని కోరెను గాని వెంకటరామయ్య యంగీకరింప లేదు. వెంకటరామయ్య ఎల్లెట్లో రోహిణి



లేవదీయగా మెల్లగలేచి యా తాటియాకు శాసనముపై సంతకము చేసెను. రోహిణి వెంకటరామయ్య వెనుకకు పడిపోకుండ యా తనివెనుకనుండి వీపుపై చేతులనుంచి యాపి యాశ్చర్యముతో నాశాసనముపై నాతడు సంతకము చేయుట చూచుచుండెను. ఈదృశ్యమును చూచుచుండిన రోహిణికి తనకష్టము లోక కష్టములు గావనియు, మానవుని సహానశక్తిని పరీక్షించుట కీశ్వరు డిట్టికష్టము గల్పించుననియు దోచెను. వెంకటరామయ్యకు క్రమముగనాయాసమును, జ్వరమును నధికమయ్యెను. కొంతవర కాతడు బాధపడినపిదప శరీరము చల్లబడి స్పృహాతప్పగా నాతడా రాత్రియే మరణించెను. రోహిణి యామ నాడే భద్రాచలమునకు బయలుదేరెను.

శ్రీరామనవమిదినమున భద్రాచలము నుత్సవము మిగులనుత్సాహముగ జరుగ చుండెను. దూరదేశములనుండి యెంతో కష్టముల కోర్చివచ్చి దైవవిగ్రహదర్శ మున కాతురతతో గుంపులుగుంపులుగ పోవుజనసమూహము ముందుగా పోలీసు వారి బెత్తములదెబ్బలు తినకుండ లోని పోజాలకుండెను. యాత్రికుల సౌకర ములకై నిర్మింపబడిన పర్ణశాలలును ఆరోగ్యశాఖవారి యారోగ్య రక్షణోపా యములును ప్రశంసార్హములై యుండెను ఖద్దరు ప్రచారకు లనేకస్థలముల ఖద్దరు ప్రాముఖ్యమును గూర్చి యుపన్యసించు చుండిరి. రోహిణి భద్రాచలము పోం యుండునని యూహించి యదివరకే భద్రాచ ముచేరిన సుధాకరుడు నొకచో నుపన్యసించె ను. ఉపన్యాసానంతర మాతడు తీర్థప్రజ కలయజూడగా వెదుకబోయినతీగ కాలికి త లినట్లు రోహిణి యాతని దృష్టిపథమునబడెను

అతను రోహిణిని చేరబోయి యాత డామె జాడ తెలియక సింగరేణిమీదుగా భద్రాచలమును చేరినవృత్తాంతమును దెలియజేసెను.

రోహిణియు వెంకటరామయ్యకు కలిగిన యాకస్మిక మరణవార్తనుమాత్రము సుధాకరుని కెఱిగించెను. ఎంతకఠినాత్ముఁడైనను చిన్ననాటనుండియు దన్ను పెంచినవాఁడగుటచే వెంకటరామయ్య మరణమునకు సుధాకరుఁడు కొంతతడవు విచారించెను.

భద్రాచలమున నుత్సవములు ముగిసిన పిదప రోహిణీసుధాకరు లిరువురును బయలుదేరి యుష్ణగుండమును, పర్ణశాలను జూచిరి. సుధాకరుఁడు తనప్రేమసందేశమును రోహిణి కెఱిగింప నుద్యుక్తుఁ డగుచుండెను. పర్ణశాల యం దానాఁడు భోజనానంతరము రోహిణి యలసియుండుటచే నిద్రించుచుండెను. సుధాకరుని మనస్సునకుమాత్రము తాను రోహిణీనాథుఁ డగువరకు నూఱట కలుగునట్లు తోఁపలేదు. రోహిణి నిద్రావస్థ నున్నప్పుడు సుధాకరుఁడు సాహసించి, వినీలకుంతములచే నొప్పారు రోహిణిమూర్థము నెత్తి తనతొడపై నిడుకొనెను. అత డామెచెక్కుల నొక్కముద్దు తన్కరింప బ్రయత్నించునపుడు నప్రయత్నముగనో ప్రయత్నముగనో, రోహిణీహస్తవల్లరు లాతనికంఠమును బంధించెను. ఒక్క క్షణములో వారిరువురును గాఢమగు బాహుపరిరంభణోత్సాహప్రవాహమున దేలిపోయిరి. కాంగ్రెసులో కలిగిన పరస్పరస్పర్శ మిట్లు పరిణమించినది. కాకేమి? సుధాకరునిహృదయము ప్రేమార్ణవము; రోహిణి ప్రేమ యొక అంతర్వాహిని. ఇప్పు డా యంతర్వాహిని బయటికుద్గతమయి ప్రేమసముద్రమున గలిసి పోయినది.

పిదప కొంతకాలమునకు రోహిణీసుధాకరులు పరిణయము చేసికొని తమయధీనమైన ధనమును ఖద్దరుప్రచారమునకు వినియోగించుచు సంఘసేవకును, దేశసేవకును, జీవితముల నర్పించుట చూడ మిగుల నానందజనకముగ నుండెను.





# నెల్లూరు—గాలివాన

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

ప్రభవ కార్తికశుద్ధ సప్తమిని, భౌమ-వాసరోదయవేళఁ జూపట్టె సింహ
పట్టణంబున నొకకొంత వర్షరేఖ-చిటుకుపాటుకునఁ జిటిపొటి చినుకుతోడ.

క. వర్షమున కెదురుచూచెడు-కర్షకసంతాన మాత్మఁ గడుఁగడుఁ బ్రమదో
త్కర్షము నెనయఁగ ఘనసం-ఘర్షణ మపుడడరె గాఢగర్జాస్ఫూర్తిన్.

గీ. ఘనఘనాఘనసమితి యాకసముఁ గ్రమ్మ-జిమ్మచీఁకటిగుంపు లోకమ్ముఁ గ్రమ్మె
దీపకళికా సముజ్జ్వలదీప్తి వెలిఁగె-మట్టమధ్యాహ్నమునఁ ద్రియామమునఁ బోలె.

*　　*　　*　　*　　*　　*　　*　　*　　*

శా. ఆనందంబును గొల్పి తొల్దొలుత పై నాశ్చర్యము గూర్చి యా
పై నెంతేని భయావహంబగుచు నాపై దిక్ఛ్రీమాపాదియై
పై నత్యంతవిషాదసంజనకమై పాపిష్ఠ ఝంఝానిలా
నూనాటోపము రూపుమాపెఁగదె నెల్లూర్పట్నపుం బొంకముల్.

గీ. అందమగుమందిరముల నుద్యానతతులఁ-జెనకి చెడఁగొట్టె తనప్రభంజనతఁ జూపి
పవనుఁ డక్కట! తనమహాబలతఁ దెలుప-ధామములఁగూల్చె వృక్షజాతముఁ బెకల్చె.

గీ. అగ్ని సాయంబుగాఁ గొని హతముచేసెఁ-గాల్చి మునుపు సుతుండు లంకాపురంబు
నీరు సాయంబుగాఁ గొని నేఁడు తండ్రి-అయ్యయో! కూల్చి నెల్లూరు హతము జేసె.

గీ. పవనదుష్టప్రవృత్తిచే భంగమొంది-ఆత్మసౌభాగ్య మడఁగాఱి యసురుసురయి
చెల్లచెదరయి చెడిపోయె సింహపురము-రాక్షసుఁడు పట్టివిడిచిన రంభవోలె.

సీ. ఒక్కతాఁకునన మహోన్నత పురసౌధభావుక సౌభాగ్యపటిమ డుల్చెఁ
గూకటివ్రేళ్లతోఁ గూల్చెను సకలమార్గముల కడ్డము మహాగములగములు
మూలముట్టుగఁబట్టె నేలకు నదిమె సదోహామయ యంత్రాలయోత్కరంబు
వికటాకృతిని ధూమశకటాలయమ్ము లయమ్మయిపోవ హుమ్మనుచుఁ దగిలె
నుక్కుతీగెలు త్రెంపెఁ; బెంపెక్కు రైలు-బండ్ల నాపెను; మఱి నిండు పారసీక
తైలభాండంబులను బడదన్ని దొలిచె-దర్పమొప్పఁగ గాడ్పు వస్తాదువోలె.




మొక్కపాటి నరసింహశాస్త్రి గారు (సాహితీసమితి)

'మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధు సహోదరాః, అర్థం నాస్తి గృహం నాస్తి...'

౧

ఆది పుష్యమాసము. ఉదయము ఆరుగంటలు అయినది. చలి చాలా ఎక్కువగా ఉన్నది. మంచు కూడా ఈ సంవత్సరము మామూలుకంటె చాలా ఎక్కువగా ఉండి సన్నని వర్షపు తుంపురులవలె పడుతూ ఉన్నది. కన్నూకన్నూ కనుపడటము లేదు. బెజవాడ వెళ్లవలె ననే ఉద్దేశ్యముతో రైలుకొరకు గోదావరి స్టేషనుకు తెల్లవారుఝామున నే వచ్చి కూర్చున్నాను. ఎంతమాత్రమూ ఎవ్వరికీ అవసరము లేదు గనుక గోదావరి మీదనుంచి గాలి రంయ్యిని వీస్తూ గజగజలాడిస్తూ ఉన్నది. మంచు దోమతెరవలె అన్నివైపులనూ కప్పివేయడముచేత ఎదురనున్న రైలుపట్టాలుకూడా కనుపడడము లేదు. స్టేషనుబయిట బళ్ల చప్పుడు, మనుష్యుల మాటలూ మట్టుకు వినపడుతూ ఉన్నాయి.

'మాతా నాస్తి పితా నాస్తి నాస్తిబంధు సహోదరాః, అర్థం నాస్తి గృహం నాస్తి......' అనే శ్లోకము నాచెవిని పడ్డది. మాతృశబ్దమునకు సర్వవిధములా ఉదాహరణగా నున్న మాఅమ్మకూడా స్వర్గస్థురాలై అప్పటికి నెలరోజులుమాత్రమే అయినది. అప్పటి నాఅవస్థ తలుచుకుంటే సరిగా ఆశ్లోకములో చెప్పినట్టే ఉన్నది. ఆమాటలు నా చెవిని పడీపడడముతో అప్రయత్నముగా నాకళ్లవెంబడి నీళ్లు వచ్చినాయి.

ఎవరు చెపుమా ఈప్రశాంతప్రభాతవేళ ఈ వేదాంతోపదేశముతో కలగిఉన్న నా హృదయాన్ని మరింత కల్లోలపెట్టినవారు అనుకున్నాను. మాటలు చెవిని పడడమే కాని మంచులో మనిషి కనుపడలేదు. నావలె రైలుకు వచ్చిన బాటసారి అయిఉంటాడా? పాపము అతనూ ఏమికష్టములో ఉన్నాడో అనుకుంటూఉండగానే నాసందేహము నివారణ అయినది.

'కామక్రోధంచ లోభంచ మోహంచ మదమత్సరాః'.

'తలితండ్రులారా, కడుపుకాలిపోతోంది. నాలుగురోజులయింది అన్నము కళ్లచూచి. ధర్మము చెయ్యండి పుణ్యాత్ములారా! ఈనిరుపేదను రక్షించండి' అనే ఆర్తనాదము నాచెవులపడ్డది. వెంటనే మనిషికూడా కనుపడ్డాడు. తొంభయిఏళ్ల తొక్కులా ఉన్నాడు. గోచీ పెట్టుకున్నాడు. ఇంకొక చిరుగులగుడ్డ కప్పుకున్నాడు. చేతులో ఒక వెదురుకర్ర ఉన్నది. దృష్టి బాగా మందగించినట్లు తెలుస్తున్నది. తలా గడ్డమూ మీసమూ నెరసి ముగ్గుబుట్టలా ఉన్నవి.

మూడుచొక్కాలు తొడుక్కుని పైన శాలువ కప్పుకున్న నాకే చలి భరించడానికి శక్యము కాకుండా ఉంటే ఇంక పాప మాభిక్షువుసంగతి వేరే చెప్పడమెందుకు.

ఆ ఆర్తనాదము విని ఆమనిషిని చూచేటప్పటికి నాకు పట్టరాని దుఃఖము వచ్చినది. నాకు ఎప్పుడు ఏముష్టివానిని చూచినా చాలా జాలిగా ఉంటుంది. వాడి కివ్వడానికి దగ్గర ఏమీ లేకపోతే ఏడుపు వస్తుంది. అదృష్టవశాత్తూ కాస్త ఉన్న ఇంట్లో పుట్టడముచేత కాని లేకపోతే, ఆ అవస్థలో ఉండవలసినవాళ్లమే కదా అనో, లేక ఏక్షణములోనో ఉన్నది కాస్తా ఊడ్చిపెట్టుకుపోతే ఇలాగే బయలుదేరవలసివస్తుంది

కదా అనే భీతితో, లేక, అందరికీ ఒక్కటే స్తరు అవకాశములుఉండి జీవయాత్రలో అంతా ఒక్కచోటనే బయలుదేరుతే ఆబిచ్చగాడే ఒకప్పుడు మనకంటె ఎక్కువగా ఉండవచ్చునని అనుమానమో! ఏ కారణమో తెలియదుకాని భిక్షువును చూచినప్పుడు మట్టుకు చేతనైన సాహాయ్యము చెయ్యకుండా వెళ్లలేను. ఏ కారణమేనా కావచ్చునుకాని చవుకగా పుణ్యము సంపాదిద్దామని, ఏ పావలా డబ్బులతో స్వర్గముకొందామనీ ఉద్దేశ్యము మట్టుకు లేదు.

అందులో ప్రస్తుతము నే ఉన్న స్థితిలో ఆభిక్షువు స్వరూపము చూచి వాడు అన్నమాటలు వినేటప్పటికి నాకుండే తెరుక్కుపోయినది. వానిని పిలిచి, డబ్బుఇద్దామని చూచేటప్పటికి దగ్గర చిల్లరడబ్బులు లేకపోయినవి. ఒక్కఅణాకాసు ఉన్నది. పోనీఅని అదితీసి వాడి చేతిలో పెట్టినాను. వాడు అది కళ్లదగ్గరగా పెట్టి చూచుకుని 'బాబూ నాదగ్గర చిల్లర లేదండి. నాలుగురోజులనుంచి ఒక్కడబ్బు నాచేతులో పెట్టినవారు లేరండి' అన్నాడు వణుకుతూను. 'పరవాలేదులే, చిల్లర అక్కరలేదు. ఏమైనా కొనుక్కుతిను' అన్నాను. వాడు మాట్లాడకుండా మళ్లీ ఆ అణాకాసుకేసి చూచి, వంగి నాముఖము ఒక్కమాటు పరీక్షగా చూశాడు. వాడి కళ్లలో నీళ్లు నిండినాయి. ఆ దుఃఖము చూడలేక, నేను నాముఖము ఒకపక్కకు తిప్పుకున్నాను. అంత ఆభిక్షువు నిటారుక్క నిలువబడి, కళ్లు తుడుచుకుని, ఒక్క నిట్టూర్పు విడిచి 'Thank you sir, may God bless you' అని ముందుకు సాగినాడు.

ఆమాట ఇంగ్లీషున అనడమూ, ఆభాష ఉచ్చారణా వినేటప్పటికి నాకు ఆశ్చర్యము కలిగినది. 'ఎవరో భిక్షువు? చదువుకున్నవానివలె ఉన్నాడే! మొదట ఏవో రెండుశ్లోకములు చదువుతే ఊరికే భిక్షాటనచేయడమున ఉపకరిస్తవని నేర్చుకున్నాడు కాబోలు ననుకున్నాను. కొంపతీసి బాగాచదువుకున్నవాడేమో. ఇలా ఉండడము నను ఎంతెంతకష్టము లనుభవించి ఉండవలెనో, ఈస్థితికి ఎందుకు వచ్చినాడో' తెలుసుకుందామని బుద్ధిపుట్టినది. ఆపూటకు నాప్రయాణము ఆగిపోయినాసరే వానిసంగతి తెలుసుకోవలెనని నిశ్చయించుకున్నాను.

లేచి పదిఅడుగులలో అతన్ని కలుసుకున్నాను. అతన్ని పలుకరించి, 'రండి, కాఫీహోటలుకు నేను తీసుకువెడుతాను. నాకూ ఆకలిగాఉండి నేనూ వెడుతున్నాను' అన్నాను. భిక్షువు ఆగి, 'అయ్యా, నేను సామాన్య భిక్షువును; తమరు గొప్పవారు, చదువుకున్నవారు. నన్ను బహువచనములో సంబోధించవలసిన అవసరము లేదు. నేను మీకంటె పెద్దవాడినే అనుకోండి వయసులో. అయినా ఆకారణముచేత రోడ్డుమీద కనపడే ప్రతివాడినీ, మీబోంట్లు, గౌరవించనక్కరలేదు' అన్నాడు.

'అవునులెండి; ఆమాట నిజమే. కాని ఏకారణముచేతనో మిమ్ములను చూస్తే, మీరు మామూలు బిచ్చగాండ్రు కారనీ, కొంత పెద్దబ్రతుకు బ్రతికి, కాలవశమున ఈ అవస్థ అనుభవిస్తున్నారనీ తోచి మిమ్ములను గౌరవించ బుద్ధిఅయినది. దానిలో తప్పేమున్నది! నడవండి వెడదాము' అన్నాను.

'అయ్యా, తాము నాకోసము వస్తున్నట్లు తోస్తున్నది. ఇంతవరకూ తాముచేసిన ఉపకారమే ఎక్కువ. నేను భిక్షాటన మారంభించినప్పటినుంచి ఒక్కరుకూడా ఒక్కసారి అణా ఇచ్చినవారు లేరు. ఇచ్చిన స్వల్పమేనా విసుక్కోకుండా ఇచ్చినవాళ్లు బహుఅరుదు. అట్టిస్థితిలో తాము మాట్లాడకుండా నన్నుపిలిచి అణా ఇవ్వడమే కాకుండా ఇంకా నాకోసము మీరు శ్రమపడడము నాకు ఎంతమాత్రమూ ఇష్టములేదు' అన్నాడు.

'నేను మీకోసము రావడములేదులెండి. వచ్చినా తప్పులేదు. ఊరికే గోరంత కొండంతచేసి మీరు అలా స్తోత్రము చేస్తూఉంటే నాకు సిగ్గుగా ఉన్నది' అన్నాను.

'నాకోసము కాదంటే నేనెలా నమ్మను. ఇంత ఉదయాన్నే ఈచలిలో స్టేషనుకు ఊరికేవచ్చి కూర్చోరు గదా, ఎక్కడికేనా ప్రయాణముమీదనై ఉండవలెను కదా. రైలుకు టైముఅయినది. అదుగో గంటకూడా కొడుతున్నాడు. దయచేసి నాకు సెలవు ఇప్పించండి. పూర్వజన్మ సంచితము అనుభవిస్తున్నానుకదా! ఈయాచనలవల్ల ఉత్తర జన్మమునకు కొంతఋణము జాగ్రతపెట్టుకుంటున్నాను కదా! అవసరమైనకంటె నన్ను ఎక్కువఋణస్థుణ్ణిగా

చెయ్యకండి. బాబూ, నామనవి విని తమరు దయ చెయ్యండి.' అన్నాడు. నేను వల్లకాదని పట్టుపట్టి కాఫీహోటలుకు తీసుకువెళ్లినాను.

అక్కడికి వెళ్లినతరువాత లోపలికి రమ్మంటే రానన్నాడు. ఎన్నివిధముల చెప్పినా వినలేదు. అందుచేతను ఇద్దరమూ వీథిఅరుగుమీదనే కూర్చున్నాము. ఆయనకు కావలసినదంతా ఆయన అడుగకుండానే కనిపెట్టి వడ్డనేవరకూ తెప్పించి ఇప్పించినాను. ఫలహారము అయ్యేవరకూ నే నేమీ మాట్లాడలేదు. ఒకటి రెండుసార్లు భిక్షువు కళ్లనుండి కన్నీటిచుక్కలు ఆయన ఆకులో పడటము చూచినాను.

ఫలహారముకాగానే లేచి, అయినసొమ్ము ఇచ్చివేసి, 'దయచెయ్యండి వెళదాము' అన్నాను.

'ఎక్కడికి, బాబూ? ఇకనైనా తమపని చూచుకోరా' అన్నాడు.

'ఏకాంతానికండి! దయచెయ్యండి' అన్నాను. మారుమాట లేకుండా నావెంట వచ్చాడు.

తిన్నగా గోదావరీతీరమునకు వెళ్లి అక్కడ మెట్ల అరుగుమీద కూర్చున్నాము.

'అయ్యా! నాదొక్కకోరిక ఉన్నది. తమర్ని అడుగకూడనిసంగతి ఒకటి అడుగుతాను. అన్యథా భావించక, తమ జీవితచరిత్ర కొంత సెలవివ్వవలెను. నాకు వినవలెనని చాలా కుతూహలముగా ఉన్నది. తమకు కష్టముగా ఉంటేమట్టుకు తమరిని శ్రమపెట్టను' అన్నాను.

'అయ్యా, ఈరోజున తమరు నాకు చేసిన మహోపకారమునకు నాకృతజ్ఞత ఎట్లా చూపవలెనో తెలియకుండా ఉన్నది. ఈజన్మలో నే నెప్పుడూ మరవజాలని దయను వారెవరు కనపరచినారు. నా చరిత్ర చెప్పడానికి అభ్యంతర మేముంటుంది. కాని చెప్పవలసినంత విశేష మేమీ లేదు. ఉన్నదికాస్తా తమబోటివారిని ఆనందించేదికాదు. అయినా తమకు వినవలెనని ఉంటే, చెప్తుతాను' అన్నాడు.

'ముఖ్యముగా వినవలెనని ఉన్నది. దయచేసి చెప్పండి' అన్నాను.

మంచు ఇంకా తెరిపి ఇవ్వలేదు. గోదావరిమీదను మరీ ఎక్కువగా ఉండి నీరుగాని నీటిపైని పడవలుగాని పక్కనున్న రైలువంతెనగాని కనుపించడము లేదు. దగ్గరనున్న మెట్లమీదనుంచి స్త్రీలు నీళ్లబిందెలు బుజాన ఎత్తుకునివస్తూ పోతూ ఉన్నట్లు, కాళ్ల అందెల చప్పుళ్లవల్లను తెలుస్తున్నది. మరను అరుగుమీద మాకు కొంచెము దూరములో నలుగురు బైరాగులు కూర్చుని 'జయ్ శంకర్ భగవాన్' అని మధ్యమధ్య గంజాయి పీలుస్తూ దగ్గుతూ కూర్చున్నారు. రోడ్డుమీద నొక ఒంటెద్దుబండి నెమ్మదిగా కనికిపాట్లుపడుతూ పోతున్నది. భిక్షువు 'అయితే వినండి చెప్తాను' అని తన కథ ప్రారంభించినాడు.

## ౨

## భిక్షువు కథ

ఏడెనిమిది సంవత్సరములక్రితము నన్ను మీరు చూచిఉన్నట్లైతే ఇప్పుడు నన్ను గుర్తించలేకపోయేవారు. మీరన్నమాట ఏమిటి. నాభార్య నన్ను గుర్తించలేకపోయినది. మీరు ఆశ్చర్యపడవలసిన పనిలేదు. మీ రనుకుంటున్నట్లు ఏడుసంవత్సరముల కాలము మనిషిలో ఇంతమార్పును తీసుకురాలేదు. ఒకవేళను అది సాధ్యమైనా ఇంతవిచారముగా? అవస్థ ఉండకపోయేది. అట్టి మార్పు క్రమేణా వచ్చేది. వస్తున్నదని మనకు తెలిసేది. మనము అందుకు సిద్ధపడి ఉండేవాళ్లము. కాని ఒక్కరోజులో ఇంతమార్పు వస్తుందని కలలోనైనా కథలోనైనా నమ్మగలరా? కాని జరిగినదంతే. ఒకపువ్వు వాడిపోవడమునకైనా దాని అల్పాయుర్దాయములో కొంచెము ఇంచుమించుగా నాలుగవవంతుకాలము పడుతుంది. ఒకమనిషి పిడుగులాటివాడు ఇలా మారడానికి ఎంతకాలము పట్టవలెనో ఆలోచించండి. ఎంత ప్రబల వ్యాధి ఉన్నా ఒక్కరోజులో ఇంతమార్పు పొందగలడా? Oh! God! తలచుకుంటే గుండె బద్దలైపోతుది. క్షమించండి. మొదలు చెప్పకుండా తుదకు వస్తున్నాను. నాసంగతి తలచుకుంటే ఆవేశము పట్టలేను.

నే నిప్పుడు మనవిచేసినట్లుగా ఏడెనిమిది సంవత్సరముల క్రితము నేను వేరుగా ఉండేవాడిని. ఇప్పటివలె

ఎండిపోయిన ఒరుగులా ఉండేవాడిని కాను. నిండు యౌవనములో ఉండేవాడిని. శరీర రక్తము పొంగి పొరలుతూ వరదలో జాలలో గోదావరివలె నా రక్తనాళములలో ప్రవహిస్తూ ఉండేది. చిన్నప్పటి నుంచీ వ్యాయామక్రీడలయందు ఆసక్తిగా ఉండి కృషి చేయుటవలన నా శరీరము కండలు దేరి పాశ్చాత్య శిల్పి చెక్కిన శిలావిగ్రహమువలె చూడ ముచ్చటగా ఉండేది. నా శరీరమును చూచుకుంటే నాకే ఎంతో సంతోషముగా ఉండేది. అందుచేతను దాని నెంతో జాగ్రతగా కాపాడుకుంటూ ఉండేవాడిని. ఈ అంగసౌష్ఠవమునకు తోడు నా ముఖముకూడా చక్కగా ఉండేదని అందరూ అనుకునేవాళ్లు. అసలు ఎక్కువ అందము లేకపోయినా, మనిషి పిడుగులా ఉండి నిండుయౌవనములో ఉంటే సామాన్యుడైనా అందముగానే కనుపడుతాడు. దానికి తోడు కొంచెము చక్కదనము ఉంటే ఇంక చెప్పనే అక్కరలేదు. అందుచేత ప్రతివాళ్లూ నాకేసి చూస్తూ, నన్ను స్తోత్రము చేస్తూ, నాసహవాసము నపేక్షిస్తూ ఉండేవాళ్లు.

నా తలిదండ్రులకు నేనొక్కడినే పుట్టినాను. అందుచేత నెంతో గారాబముగా పెరిగినాను. ఆటలయందూ పాటలయందూ ఉన్నశ్రద్ధ నాకు చదువులో ఉండేదికాదు. చక్కదనమంటే ఆసక్తే చదువ బుద్ధి అబ్బేదికాదు. తరుచు పరీక్షలలో నిర్బంధములో చదువుతూ ఉండేవాడిని. ఏమి చదివినా ఏమిన చదకపోయినా నెమ్మదిగా మెట్రిక్యులేషను ప్యాసయి ఇంటర్మీడియేటులో ప్రవేశించినాను. రెండో సంవత్సరములో చదువుతూ ఉండగా నాకు వివాహము జరిగినది. నా వివాహమైన కొద్దిమాసములకే మాతల్లిదండ్రులు హఠాత్తుగా కాలము చేసినారు. సంసారము నెత్తిని పడ్డది. సంసారమంటే పెద్ద బాదరబందీ ఏమీలేదు. ఏదో కొద్దిగా ఉన్నవాళ్లముకాని అంత బొత్తుగా లేని వాళ్లముకాము. అయినా నాకుమట్టుకు చదువబుద్ధి అయినదికాదు. అందుకని చదువుమాని కొన్నాళ్లు ఇంటిదగ్గర ఊరికే కూర్చుని కాలయాపన చేసినాను. అలా ఊరికే కూర్చోవడము నాకే బాగాలేకపోయినది. అందుచేతను ఉద్యోగప్రయత్నము చేసినాను. అధికారి అన్న అడ్డమైనవాళ్ల చుట్టూ తిరిగితిరిగి ప్రాణమువిసిగి ఆప్రయత్నము మానుకొన్నాను.

ఇలాకొన్నాళ్లు గడచినతరువాత పోలీసు ఇన్స్పెక్టరీకి ప్రయత్నము చెయ్యవలెనని బుద్ధిపుట్టినది. ఆప్రయత్నము చెయ్యగానే, వెనుకటివలెగాక, నాప్రయత్నము సఫలమైనది. సెలెక్షను దొరకినది.

నలుగురితోపాటూ ట్రయినింగుఅయి ఉద్యోగములో ప్రవేశించినాను. చాలా న్యాయముగా ఉండవలెననీ, కష్టపడి పనిచేయవలెననీ, వృత్తిగౌరవము కాపాడవలెననీ మహదాశయములతో ఉద్యోగము ప్రారంభించినాను. కొలదికాలములో చాలామంచివాడిననీ, న్యాయశుద్ధుడననీ, దురుసైనవాడిననీ పేరుపొందినాను.

ఉద్యోగములో ప్రవేశించిన కొద్దిరోజులకే నా భార్య కాపురమునకు వచ్చినది. ఆమెకూడా చాలా చక్కని మనిషి. మేమిద్దరమూ చిలకా గోరువంకలవలె ఉండేవాళ్లము. చుట్టుపక్కలవాళ్లు మా అనుకూల దాంపత్యము చూచి ఎంతో సంతోషించేవాళ్లు. నా భార్యకు నాపై నున్నప్రేమ తలచుకుంటే నాకే ఆశ్చర్యముగానూ ఒకప్పుడు భయముగానూ ఉండేది. నాలుగు సంవత్సరములపాటు ఒక్కక్షణముకూడా నన్ను విడిచి ఉండలేదు. నేను దగ్గరలేకపోతే పుట్టింటికికూడా వెళ్లేది కాదు. ఆనాలుగు సంవత్సరాలూ అద్వితీయమూ, మానవాతీతమూ అయిన సౌఖ్యమును అనుభవించినాము.

సంతోషము ఎప్పుడూ దుఃఖముతో మిళితము కాకుండా ఉండదు కాబోలు. ఒడలెరుగని సంతోషములో ఉండగా మాఅమ్మ నాలుగురోజులు జ్వరము వచ్చి స్వర్గస్థురాలైనది. నిర్మలమైన మా ఆనందసరస్సులో ఒకపెద్దరాయి పడినది. అలలు బయలుదేరినవి. మా అమ్మపోయిన విచారములో ఉండి సెలవుతీసుకుని ఉండగా, సెలవు ముగియగానే మన్యమునకు మార్చినారనీ, ఒక్కసంవత్సరము అక్కడ పనిచేయవలసినదనీ ఆర్డరు వచ్చినది. దానితో మేమిద్దరమూ మరీ బెంగ పెట్టుకున్నాము.

ఆమన్యప్రాంతములకు నాభార్యనుకూడా ఎట్లా తీసుకువెళ్లను. అది సాధ్యముకాదు. అందుకని ఆమెను

పుట్టింట విడిచి వెళ్ళవలెను. ఒక్కసంవత్సరము ఆమెను విడిచి ఉండడము ఎట్లాగు. నామాట ఏలాఉన్నా అందుకు నాభార్య ఒప్పుకోలేదు. సుతరామూ పుట్టింటికి వెళ్లనన్నది. తనూ నాతో వస్తానన్నది. లేకపోతే నన్ను ఉద్యోగము మానుకోమన్నది. ఉద్యోగము మానుకోవడము ఎట్లాగు? పనియందు నాకు ఉత్సాహము కలిగినది. మంచి పేరుకూడా వచ్చినది. ఏదో ఒక ఏడాది పాటు శ్రమపడితే తిరిగి మన్యము విడిచి వచ్చేసరికి ప్రమోషనుకూడా అవుతుంది. ఇదంతా నాభార్యకు బోధపరచి చెప్పినాను. తుదకు ఏలాగైతేనేమి సమాధానపరచి పుట్టింట దిగపెట్టినాను. కాని మాకిద్దరకూ కూడా మనసులో ఒక చెప్పరాని భయమూ బెంగా బయలుదేరినది. ఈజన్మములో నింక ఇద్దరమూ కలుసుకోమేమో అనుకున్నాము. ఏదో గొప్పకష్టము రానున్నదనే భ్రాంతిమట్టుకు మాకు బాగాతోచింది. ఆబెంగతోనే ఒకరోజున బయలుదేరి నాఉద్యోగము ఊరు చేరుకున్నాను.

3

ఆఅరణ్యముల సౌందర్యము వర్ణించడానికి నాపాటివానికి శక్యముకాదు. ప్రస్తుతము అవసరమూ లేదు. కాని ఒక్కమాటమట్టుకు చెప్పక తప్పదు. అక్కడి ప్రకృతిసౌభాగ్యమును చూచి ముగ్ధుడనైపోయాను. ఆఆనందములో నాబెంగను కొంత మరచిపోయినాను. ఇటువంటిచోట నాకు ఏమి అపాయము వస్తుంది అనుకున్నాను. నాలో అణగిఉన్న సౌందర్యకాంక్ష, కవిత్వము, ప్రకృతి యందలి ప్రేమ, భావనాశక్తి, విశ్వప్రేమ, అన్నీ ఒక్కసారి బయటపడ్డవి. నన్నిక్కడకు మార్చినందుకు నా పైఅధికారులకు వందనము అర్పించాను.

నేను ఒక్కడినీ స్టేషనులోనే ఎప్పుడూ కాలక్షేపము చేస్తూఉండేవాడిని. మా స్టేషనుకు దగ్గరలోనే ఓవర్సీయరుఆఫీసు ఉండేది. ఆ ఆఫీసుకు దగ్గరలోనే ఓవర్సీయరు, దాక్షిణాత్యుడు, తనభార్యతో కాపురముండేవాడు. నే నక్కడకు వెళ్లిన కొద్దిరోజులలోనే మాకిద్దరికీ స్నేహము కలిసినది. తరుచు నేను వారింటికి వెళ్లడమో లేక ఆయన నాబసకు రావడమో జరుగుతూ ఉండేది.

ఇలాగు ఏబెంగా లేకుండా సుమారు ఎనిమిది మాసములు గడచినవి. ఇంకను తిరుగ ఇంటికి వెళ్లేరోజులు సమీపిస్తున్నవిగదా అని సంతోషిస్తూ ఉండేవాడిని. కొత్తగా వచ్చినప్పుడున్న బెంగ నిర్హేతుకము గదా అని నాలో నేనే నవ్వుకుంటూ ఉండేవాడిని.

నేను ప్రతిరోజూ రెండుపూటలా నాగుర్రము మీద షికారుకెడుతూ ఉండేవాడిని. మామూలు ప్రకారము ఒకరోజు మధ్యాహ్నము మూడుగంటలకే బయలుదేరి షికారుకెళ్లినాను. ఆరోజు మామూలుకంటె చాలా దూరము వెళ్లినాను. ఆ అడవికి అదివరకు నే నెప్పుడూ వెళ్లలేదు. నే నిదివరకు చూచిన అన్ని అడవులకంటే కూడా చాలా అందముగా ఉన్నది. గుర్రమును అక్కడ ఒక చెట్టుకు కట్టివేసి నేనొకరాతిమీద కూర్చుని ఆ సౌందర్యమును చూచి ఆనందిస్తున్నాను. అలాగే నాకు తెలియకుండానే సూర్యాస్తమయము కావచ్చినది. నేను కూర్చున్నచోటుకు దగ్గరగానే ఒక పెద్దచెరువు ఉన్నది. కొన్ని లేళ్లు వచ్చి నన్నుచూచి సందేహించి నేను నిశ్చలముగా కూర్చుండుటవల్ల భయమువదలి నీళ్లుతాగి చక్కాపోయినాయి. చెట్లలో పక్షులుచేసే రొదతో చెవులు గింగురుమని పోతున్నాయి. కొంచెము దూరములో ఒక నెమళ్లగుంపు పరుగెత్తుకుపోతోంది.

సూర్యుడు అస్తమించబోతున్నాడు. చెరువుకు నీళ్ల అడుగున ఎర్రని డాకురేకు పరచినట్లుగా ఉన్నది. మధ్యమధ్య చెట్లనీడపడి చాలా చక్కగా ఉన్నది. ఆచెరువుకేసి తదేకదీక్షగా చూస్తూఉండగా దూరాన్ని ఒక పెద్దపులి నెమ్మదిగా ఒకచెట్టుచాటునుంచివచ్చి నీళ్లు తాగుతోంది. దాన్ని చంపుదామా అని పక్కనున్న తుపాకీపైకి చెయ్యి పోయింది. కాని ఆ సమయములో అంతఘోరకృత్యము చెయ్యబుద్ధి అయిందికాదు. చెయ్యి తుపాకిమీదనుంచి తీసివేశాను. పెద్దపులి, దానిదారిని అది పోయింది. నే నింక వెళదామని లేవబోతున్నాను. నా వెనుకనుంచి కిలకిల నవ్వు వినబడ్డది. లేచి వెనక్కు తిరిగి చూచాను. నావెనుక ఒకచెట్టును విలాసముగా చేర్లపడి సుమారు పదునిమిది సంవత్సరముల

'ఇంతకాలము ఊరకున్నారేమి, ఇక్కడకు రాకుండాను' అన్నది ఆఖరికి ఆపిల్ల. నేను ఉలిక్కిపడ్డాను. గగనసంచారముచేస్తున్న నా ఊహాలను వెనక్కి మళ్లించి, 'ఇంతకాలము ఏమిటి, ఎంతకాలము' అన్నాను.

'ఎరుగరా! మీరిక్కడకు వచ్చి ఏడెనిమిది మాసములైనదే. అప్పటినుంచీ నేను మీకోసము ఎదురుచూస్తున్నాను. ఒక్కసంవత్సరమునుంచి నాహృదయములో చెప్పశక్యముగాని ఆందోళన బయలుదేరినది. దానికి ఏవిధమైన శాంతిచేదామన్నా సాధ్యమైనదికాదు. నాకెప్పుడూ నిద్రపట్టేదికాదు. తిండి తినబుద్ధి అయేదికాదు. ఎక్కడినుంచో ఏదోపిలుపు వినపడుతూ ఉండేది. దేనికోసమో నిరంతరమూ వెతుకుతూ ఉండేదాన్ని. ఎప్పుడూ ఈఅడవులలో ఈచెట్లమధ్య తిరుగుతూ ఉండేదాన్ని. మావాడే ఒకడు తన్ను పెళ్లిచేసికోమని చాలా తొందరపెట్టినాడు. నాకెంతమాత్రమూ ఇష్టములేకపోయినది. మీరు వస్తారని నాకు తెలుసును. ఏడెనిమిది మాసములనుంచి హృదయవేదన కొంచెము తగ్గినది. అప్పుడు మీరు సమీపములో ఉన్నారని తెలుసుకున్నాను. అప్పటినుంచి ఇంకా రారేమని కనిపెట్టుకుని ఉన్నాను. ఆఖరికి నిన్న మిమ్ములను చూడగానే పట్టరానిసంతోషము వచ్చినది. మండువేసంగిలో మలమల మాడిపోయిన భూమిపైన తొలకరివర్షము పడితే ఉన్నట్లుగా ఉన్నది నామనసుకు అప్పుడు. ఇంతకాలమునుంచీ నేను ఎదురు చూస్తున్నది మీకోసమేనని తెలుసుకున్నాను. నేనిక్కడ కనిపెట్టుకున్నానని మీకెప్పుడూ తోచలేదూ? అయితే మీ నాగరికులు అటువంటి సూచనలు తెలుసుకోలేరేమో. మాఅటవికులసంగతి వేరు. ప్రతి గాలిలోనూ మా శోకవార్త ఉంటుంది. ప్రతిపక్షి కిలకిలలోనూ మా శోకపాట వినిపిస్తుంది. ప్రకృతిలో ప్రతి ఒక్కధ్వనికీ మాహృదయము ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. మీలో అలా కాదేమో!' అని ఊరుకున్నది.

నేను ఏమిచెప్పడమునకూ తోచినదికాదు. అమాయకురాలైన ఆపిల్లమాటలు విని, జ్యోతులవలె ప్రకాశిస్తున్న ఆమెకన్నులు చూస్తూ, ప్రేమపూరితము, అగాధము అయిన ఆమెహృదయమును తలచుకుంటే నాకే భయముచేసినది. ఏమీ అనలేకపోయినాను. అనిర్వచనీయమైన కరుణారసము బయలుదేరి నన్ను ముంచెత్తినది. నాచెయ్యి ఆమెపైపుకు జాపినాను. ఆమె నాకరగ్రహణముచేసి, నాదగ్గరగా జరిగి నా కాళ్లపైన తనతల ఆనించి, కన్నీటితో నాపాదములను తడిపింది.

అలాగే కదలకుండా సూర్యుడు నెత్తిపైకి వచ్చేవరకూ నోరులేనిపక్షులవలె కూర్చున్నాము. నన్నుగురించి ఆమె ఏమీ అడుగలేదు. నేనేమీ చెప్పలేదు. లేచి 'నేను వెడతాను' అన్నాను. 'సరేను' అన్నది. మళ్లీ ఎప్పుడు వస్తావని అడుగలేదు. ఎవరిదారిని వారు వెళ్లినాము.

ఆసాయంకాలము మళ్లీ అక్కడనే కలుసుకున్నాము. మా ఉభయులమైత్రీ ఎట్లు అభివృద్ధి పొందినదీ ఇప్పుడు నేను చెప్పలేను. అదంతా తలుచుకుంటే నాకు చాలాబాధగా ఉన్నది. అందుచేత నన్ను క్షమించండి. కాని ఒక్కసంగతి: ఆ అమ్మాయి ఆరోజులలో అన్నమాటలూ, చేసినచేష్టలూ, చూచినచూపులూ జన్మజన్మాంతరములకూ మరుపురావు. అహర్నిశాదులు దుస్స్వప్నములవలె ఎప్పుడూ నాకళ్లకు కట్టినట్లుండి యమబాధ పెడుతున్నాయి. అన్నివిధములా నరకము అనుభవిస్తున్నాను.

కొన్నిరోజులలా సుఖస్వప్నమువలె గడచిపోయినాయి. ఒకరోజు రాత్రి భోజనముచేసి పండువెన్నెలలో కుర్చీవేసుకుని కూర్చున్నాను. ఊహాప్రపంచములో సంచరిస్తూ పరధ్యానముగా కూర్చున్నాను. సుమారు రెండు ఝాములరాత్రి అవుతుంది. ప్రపంచమంతా నిశ్శబ్దముగా ఉన్నది. దూరాన్ని ఎక్కడో పులి అరుపు వినపడ్డది. ఎక్కడనో ఒకకీచురాయి శబ్దముచేస్తూఉన్నది. నాకు కొంచెము దూరములో నానౌకరు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. హఠాత్తుగా నావెనుకనుండి ఎవరో వచ్చి నాకళ్లు మూశారు. ఉలిక్కిపడి చేతులుపట్టిచూ[illegible]బోయపిల్ల అని తెలుసుకున్నాను. నెమ్మదిగా నవ్వుతూ నాకుర్చీచేతిమీద కూర్చున్నది. ప్రతిరోజూ తను అక్కడనే నిద్రపోతున్నాను అని చెప్పింది.

* * * * *

తెల్లవారకముందు లేచి వెళ్లిపోయింది.

౫

ఇలాగు మూడుమాసములు గడచినవి. నాకు ఇక్కడ ఉద్యోగము ఆఖరు కావస్తున్నది. ఇంకొక నెల దినములలో ఇంటికి పోవచ్చునుకదా అనుకున్నాను. ఈపిల్లతోటి, ఎలా చెప్పడము ఎలావదలించుకోడ, మనుకుంటూ ఆలోచిస్తూ, ఒకరోజు రాత్రి మావసారాలో పచారు చేస్తున్నాను. బయట గాఢాంధకారముగా ఉన్నది. అప్పటికి సుమారు పదకొండుగంట లవుతుంది. నావెనుక మెల్లగా వస్తున్న అడుగులచప్పుడు వినపడ్డది! నేను వెనక్కు తిరిగి చూచేటప్పటి కప్పుడే ఆవ్యక్తి నాదగ్గరకు వచ్చినది.

పరీక్షగా చూచేసరికి ఆమె నా స్నేహితుడైన ఓవర్సీరుభార్య. ఆరోజున ఆయన ఊళ్లో లేడని నాకు తెలుసును. ఎందుకు వచ్చినదా అనుకున్నాను. ఉత్తర క్షణములోనే నా సందేహము తీరినది. 'ఏమి, అలా చూస్తారు? ఇట్లా వచ్చినానని నాపైన కోపమా' అంటూ నెమ్మదిగా దగ్గరకు చేరింది.

నేను ఆవూరు వచ్చినప్పటినుంచీ ఆమె నాయెడల చూపిన ఆదరములవల్లా, భర్తచాటునుంచో లేక నేను ఒంటరిగా కనుపించినప్పుడో ఆమె చూపిన హావభావ విలాసాదులవల్లా ఆమె నన్ను వేరుచూపుతో చూస్తున్నదని తెలుసుకున్నాను. నాకు చిన్నప్పటినుంచీ ఇటువంటి అనుభవములు చాలా అయినవంటే మీరు అతిశయోక్తి అనుకుంటారేమోనని సందేహిస్తున్నాను. కాని ఈ ఒక్కబోయకన్య విషయములోతప్ప నే నెక్కడా ఎవ్వరికీ లొంగలేదంటే మీరు నమ్మవలెను. అటువంటి అప్పుడు ఈమె-నాస్నేహితునిభార్య-ఇలా సాహసించడముతోనే నాకు చాలా ఆశ్చర్యము కలిగింది. ఆమె ననేకవిధాల మందలించి పంపవలెనని ప్రయత్నము చేసినాను. నేను వద్దన్న కొద్దీ ఆమెదగ్గరకు వచ్చి నన్ను ఆలింగనము చేసుకోబోయినది.

ఆసమయములో వికటమైన ఒక పెద్దనవ్వు నాకు వినపడ్డది. దానితో ఆమె హడలిపోయి మళ్లీతిరిగిచూడకుండా వాళ్లబసకు పోయింది. ఆనవ్వు ఎక్కడనుంచి వచ్చినదో నాకు తెలుసును. నేను నిశ్చలముగా నిలబడ్డాను. నిప్పులు కక్కుతున్న కళ్లతో పొంచియున్న పులి నెమ్మదిగా ఎరదగ్గరకు వచ్చినట్లు ఆబోయపిల్ల నాదగ్గరకు వచ్చి 'ఎవ రామనిషి' అన్నది. ఎవరైతే నీకెందుకు అన్నాను.

'నాకు కాకపోతే ఇంకెవరికి? ఎందుకు ఆవిడను కౌగిలించుకున్నావు' అంది.

'నేను కౌగిలించుకోలేదు. ఇంతకీ, నేను కౌగిలించుకుంటేమట్టుకు నువ్వెవరు అడగడానికి? నీకేమైనా బొందికట్టినానా' అన్నాను కోపముగాను.

దానితో కొంచెముతగ్గి 'నువ్వూ ఇలాటివాడవేనా? నీవు వేరనుకున్నాను. నేనిది సహించలేను' అన్నది. 'మరి అయితే నేను వెళ్లినతరువాత ఏమిచేస్తావు' అన్నాను.

ఛంటన లేచి, 'ఏమిటి? వెళ్లిపోతావా? నన్ను విడిచిపెట్టి వెళ్లిపోతావా? నాగతేమిటి? నువ్వు మామూలుమనిషివి కావనుకున్నాను. అందరిలాటివాడవే నీవూను. దొరకినవరకూ పుచ్చుకోడమూ, ప్రతిఫలము కోరినప్పుడు మాట్లాడకపోవడమూను చెరకుకు రస మున్నంతవరకు పీల్చి పిప్పిచేయడమూను, పారవేసి పోవడమూను. నన్నింతమోసము చేస్తావనుకోలేదు.' అని విలపించడము ప్రారంభించింది.

నాకు బాగా కోపము వచ్చింది. 'ఏమిటి ఈ అల్లరంతాను! వెళ్లిపోక ఇక్కడ నీకు పాదసేవ చేస్తూ కూర్చుంటా ననుకున్నావా ఏమిటి? నాకేమీ ఇల్లా వాకిలీ, పెళ్లామూ లేవనుకున్నావా' అన్నాను.

'ఏమిటీ? నీకు భార్యకూడా ఉన్నదా? అయితే వెళ్లడము నిశ్చయమే. అయ్యో, నాతోటి మొదటనే ఎందుకు చెప్పలేదు. నీచక్కనిముఖము చూచి నీ హృదయముకూడా అంత శుభ్రమైన దనుకున్నాను' అని ఇంకా ఏమేమో నన్ను నిందిస్తూ నాపాదముల దగ్గరపడి చాలాసేపు ఏడిచింది.

నేనేమిచేయను? నాకు మనస్సులో చాలా కష్టముగానే ఉన్నది. నేను ఆపిల్లను మోసముచేయవలెననుకోలేదు. కాని నాసంగతి చెప్పవలసినదే మొదట.

అది నాతప్పే. అప్పుడు నేను నేనుగా లేను. నాకు ఏమీ స్వతంత్రము లేకపోయింది. మహాప్రవాహములో కొట్టుకుపోతున్న నావలాగ అశక్తుడనై ఊరుకున్నాను. శ్రుతిమించిన తరువాత, తప్పుకోడ మెలాగానే అహర్నిశా దులు ఆలోచిస్తున్నాను.

ఇప్పు డీపిల్లను ఎలా ఊరుకోపెట్టడానికీ తోచ లేదు. మాట్లాడకుండా అలాగే నిలబడ్డాను. కొంతసేపు ఏడ్చిఏడ్చి, తుదకు లేచి నా రెండుచేతులూ పట్టుకుని, 'అయితే నిజంగా వెడతావా' అంది. ఆమెముఖము చూస్తే నాకూ కళ్లమ్మట నీళ్లువచ్చినాయి. 'వెళ్లక ఏమి చెయ్యను. ఇంతకూ ఇంకొక నెలరోజులు పోయినపిమ్మట కదా' అన్నాను.

కన్నుల నిప్పులు కురుస్తూ ఉరుము ఉరిమినట్లు 'అవును పాపము, ఇంకొక నెల ఇక్కడ ఉండాలి కాబోలు. తరువాత సుఖముగా భార్యకౌగిట్లో స్వర్గము అనుభ వించవచ్చును. నేనేమైతే నీకేమి. ఎక్కడినుంచో మా అడవులలోకి వచ్చావు. మీ ఉద్యానవనాలలో దొర కని దివ్యకుసుమము ఒకటి కనుపడితే అది కోసుకు న్నావు. కాసేపు ఆఘ్రాణము అనుభవించావు. ఇంకా అది నలగనేనా నలగకుండా, వాడనేనా వాడకుండా నేలమీద గిరవాటేసి పోతున్నావు. నీకేమి, ఇంకొక పువ్వు దొరుకుతుంది. నలిగిపోయేది వాడిపోయేదీ పువ్వుకాని నీవుకాదుకా. నువ్వెప్పుడూ మందహాసము చేస్తూ ఏమీ ఎరగనట్లు వాయువులాగ నీ ఇష్టము వచ్చినచోట సంచరించవచ్చును' అని గర్వనిర్భరముగా ఒకనవ్వు నవ్వింది.

ఒక్కక్షణము ఊరుకుని, 'నువ్వు పాపము సుఖ పడదామని సంతోషిస్తున్నావేమో. నీకింక సుఖమన్న మాట లేకుండా చేస్తాను. నాకెలాగూ లేదు. నీవుమట్టు కెందుకు సుఖపడాలి? నిన్నిక్కడనుంచి సుఖంగా వెళ్ల నివ్వను. నాకు నువ్వు దక్కకపోయినాసరే కాని ఇత రుల కౌగిట్లో నిన్ను చూచి సహించలేను. ఆ ఆలోచన కూడా సహించ శక్యము కాదు. మాసంగతి నీకు తెలి యదు. మేమెంత ప్రేమించగలమో అంతకంతా అస హ్యించుకోగలము. అమృతము పుట్టినచోటనే విషము కూడా పుట్టింది. ఇంతగా నన్ను ప్రేమించిన మనిషి నా కిపకారము చేస్తుందా అనుకుంటావేమో. అటువంటిభ్ర మలు పెట్టుకోకు' అని ఒక్కపరుగున చక్కాపోయింది.

నాకు ఎక్కడలేని భయమూ వేసింది. కాళ్లు వణకడ మారంభించినవి. అక్కడనే చదికిలపడి, తెల్ల వారువరకూ పోడిగుడ్లతో కూర్చున్నాను.

౬

ఇంక నాకథ ఆఖరు కావస్తున్నది, క్షమించండి, ఇంతసేపు మిమ్ముల్ను కూర్చోపెట్టినందుకు, ఉదయాన్నే బయలుదేరి ఆపిల్లను కలుసుకుని కొంచెము సముదా యిద్దామని మాన్యాలుచోటికి వెళ్లినాను. అక్కడ కన పడలేదు. తిన్నగా ఇంటికి వచ్చి భోజనముచేసి పడు కున్నాను. సాయంకాలముకూడా ఆపిల్ల కనపడలేదు. 'ఏమి భగవంతుడా, ఇదేమి చేస్తుందా' అనుభీతితో మళ్లీ భోజనంచేసి పడుకున్నాను. తెల్లవారుసరికి ఉప ద్రవమైన కలకొప్పితో లేచాను. కళ్లు తెరిచేసరికి నా శరీరము నాకే అసహ్యముగా కనుపించింది. అద్దము దగ్గరకువెళ్లి చూసుకున్నాను. మీ కిప్పుడు కనుపడ్డస్థితిలో నాశరీరము నాకు కనుపించింది. ఆకాశము విరిగి నెత్తిని పడ్డట్టయినది. స్పృహతప్పి పడిపోయినాను. కొంతసే పటికి తెలివి వచ్చింది. కర్ణకఠోరమైననవ్వు దూరాన వినపడ్డది. ఆమనిషిని చంపుదామని తుపాకితీసుకుని పరు గెత్తాను. ఎక్కడా దొరకలేదు. ఇంక చేయవలసిన దేమున్నది? ఒక్కవిసవుగాలి వచ్చి ఫలోన్ముఖమైన చెట్టును మాడ్చేసింది.

తక్షణం ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి రెండవ కంట పడకుండా మాఅత్తవారింటికి చేరుకున్నాను. ఎవ్వరూ నన్ను ఆనవాలు పట్టలేక పోయారు. మా మామగారితో జరిగినదంతా చెప్పాను. నిశ్చేష్టుడై విన్నాడు. చాలాసేపు విచారించాడు. నాఆస్తి నా భార్యపేర వ్రాయించాడు. నన్ను ఎక్కడికేనా వెళ్లి మందు పుచ్చుకోమన్నాడు.

'నే నీస్థితిలో ఎక్కడికి వెడతాను? మా అమ్మ కూడా లేదాయెను. ఇక్కడనే ఉండి మందు పుచ్చు కుంటా' నన్నాను.

'పిల్లలున్న ఇల్లు; ఇక్కడెలా వీలవుతుంది. నీ శరీరము పరుసచూస్తే కుష్ఠువ్యాధిలా ఉన్నది. ఇక్కడ ఆట్టే వీలుగా ఉండద'న్నాడు.

'అయితే నా భార్యను పంపండి. మేము వేరే ఉంటాము' అన్నాను.

'అమాయకుడులా ఉన్నావు. అదిమట్టుకు ఒక్క స్త్రీ ఉండి నీకు ఏమిసంరక్షణ చెయ్యగలదు. ఇది ఘోరమైన అంటువ్యాధి అన్నసంగతి నీకుమట్టుకు తెలియదా. దాన్ని ఎందుకు బాధపెడతావు. పైగా ఈ అల్లరంతా నలుగురునోళ్లా పడటము ఎందుకు. ఎక్కడికో వెళ్లి చడీచప్పుడూ కాకుండా మందుపుచ్చుకో' అన్నాడు.

నా భార్యను పిలిచి 'నీఅభిప్రాయమేమి' టన్నాను. మాట్లాడకుండా ఏడుస్తూ నిలబడ్డది. కొంతసేపటికి 'ఏ రామచంద్రపురం ఆసుపత్రిలోనో మందు పుచ్చుకుంటే వీలుపడదా' అంది.

నేనింక మారుమాటాడకుండా వచ్చాను. ఒకరిద్దరు వైద్యుల నడుగుతే ఇదేవ్యాధో అసలు తెలుసుకోలేక పోయారు. పైకి ఇలాఉన్నా లోపల మామూలుగా బలముగానే ఉన్నది. చేసేది ఏమీలేక ఇంటికి తిరిగీ వెళ్లడము ఇష్టము లేక భిక్షాటన ఆరంభించాను. ఈ ఒక్కపొట్టకు తిండికొరకడమే కష్టముగా ఉన్నది. ఏమిచెయ్యను? నే చేసుకున్న పాపము. జన్మాంతర సంబంధమై ఉండవలెను. ఎంతెంతమందో ఎన్నో ఘోరకృత్యములుచేసి సుఖంగా ఉంటారే. నాఖర్మముమట్టుకు ఇలా ఎందుకు కాలవలెను?"

౨

చాలాసేపు ఆభిక్షువు అలా విచారిస్తూ కూరు[చు]న్నాడు. నాకూ జాలివేసి నేనూ కాస్సేపు విచారించాను. 'అయ్యా, విచారించకండి. నిప్పుతో చెలగాటా లా[డినప్పుడు?]టప్పుడు ఒకొక్కప్పుడు ఒళ్లుకాలడము సహజమేన[ు]. కాని మీరు అధైర్యపడకండి. ఇటువంటి భయంక[ర]మైన వస్తువులు ఉన్నవని విన్నాను. మీరు చెప్పిన[ది] దానికి దృష్టాంతరముగా ఉన్నది. దీనికి విరుగుడుకూడా ఉన్నదని వైద్యులు చెపుతారు. ఎంతత్వరలో వచ్చినదో అంతత్వరలోనూ మళ్లీ నివారణ అవుతుంది. కాబ[ట్టి] మీరు మళ్లీ ఒక్కసారి మన్యము వెళ్లి ఏకోయవాని[...] సేవా ఆశ్రయిస్తే లాభిస్తుం'దని సలహా ఇచ్చాను.

ఆమాటలు విని బ్రహ్మానందభరితుడై నాకు న[మ]స్కారముచేసి, నేనిచ్చిన రూపాయి తీసుకుని వ్యా[ధి] అప్పుడే కుదిరినట్లుగానే సంతోషించి వెళ్లిపోయాడు.

మంచుతెర తొలగిపోయింది. సూర్యుడు చక్క[గా]గా ఉదయించాడు. రైలుస్టేషనుదగ్గర మళ్లీ రైలు గంటకొట్టారు. ఈరైలేనా తప్పకూడదని నెమ్మది[గా] స్టేషనుకు వెళ్లాను.



# శరత్తు: ఋతువు

(దాటువులు)

వడ్డాది సుబ్బారాయుఁడు గారు

ఆకృతిలేక భూతబహిరంతరపూర్ణ నిజప్రకాశతన్
స్వీకృత దుష్టశిష్టజన శిక్షణరక్షణ కార్యభారుఁడై
లోకులకుం గనంబడక లోకములేలు దయాపయోధి, సు
శ్లోకుని, భక్తపాపభయశోకహరుం, బరమేశుఁ గొల్చెదన్.

సీ. సర్వోన్నతంబైన శ్యామలాకాశప్రదేశంబు నాదేవదేవుమూర్ధ
మర్ధరాత్రమున గాఢాంధకారంబులో వెలుఁగుజ్యోతులు నాదువిభునికనులు
పదునాఱుకళలతోఁ బండువెన్నెలగాయు చందురుమామ నాసామిమోము
హాలపద్మముఖ్యరేఖాంకితంబైన విశ్వంభర నామహాప్రభుపదములు
చేతనాచేతన పదార్థజాత పూర్ణ-మైనరోదోంతరంబు నాయధిపునుదర
మనుచు నాయాత్మ మనసున కందరాని-నీకుఁ గల్పించి రూపు ధ్యానించు నాథ!

ఉ. సృష్టి ప్రకాశహీనమయి వృష్టిదినంబుల నిద్రవోవు; వి
స్పష్టముగా వికాసమున శారదవేళను గానవచ్చు; నీ
దృష్టినొ, విశ్వరూపుఁడగు శ్రీహరి నాల్గునెలల్ శయించి ని
శ్చేష్టతఁ, గార్తికంబునను జెందుఁ బ్రబోధ మటండ్రు పండితుల్.

ఉ. వేయిఫణాలపై మణులు వెల్గెడు పయ్యరదూదిపాన్పుపై
హాయిగ జాయ కౌఁగిటఁ బయోంబుధిఁ గూరుకు లోకసౌఖ్య సం
ధాయకు మేలుకొల్పెడు విధంబునఁ బేల్తురవాయులుం, డపా
కాయలు, నోటులున్ మొదలుగల్గిన వాశ్వయుజాంతయామినిన్.

చ. పడగల మీఁదిరత్నముల భాతిని భాసిలు దీపపంక్తు లె
ల్లెడ; బుసుబుస్సుమంచు ధ్వనియించును జువ్వ; లమానరేయి, న
ల్గడలు నిజప్రకాశమునఁ గప్పను దెల్లమతాబు; లిన్నియుం
నిడుపనిసెజ్జఁ బాల్కడలి నీరజనాభుఁడు లేచుసూచనల్.

...న్న ప్రజలకు స్వాతంత్ర్య శకలములు ...కారణము లగునటులు సంయోగకార ...లు గాజాలవు సంస్థానములు బ్రిటీషు ...లు ప్రతిఘటించుచున్నవి. హిందు మహమ్మదీయులు ప్రతిఘటించుచు ...రు. బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు ...తిఘటించుచున్నారు. కాపులు, కమ్మలు, వెలమలు, కలాలీలు మొదలగుజాతు లన్యోన్య ప్రతిఘటనమునకు బూనుకొనుచున్నవి. వివిధ సంఘములకు, పక్షములకు దేశప్రయోజనములు లుప్తములై స్వప్రయోజనములు విపరీతాకృతిని దాల్చుచున్నవి. భారత జాతీయ లక్ష్యము మానవధర్మ లక్ష్యము సంకుచితమై ...ఘిక లక్ష్యము విపరీతాకృతిని దాల్చు...న్నది.

హిందూ మహాసభ, మహమ్మదీయ మహాసభ, బ్రాహ్మణేతర మహాసభ, బ్రాహ్మణ మహాసభ, వైశ్య మహాసభ, కమ్మమహాసభ, కాపుమహాసభ, ఆదిమాంధ్రమహాసభ మొదలగుసభలు జాతీయ లక్ష్యమును సంకుచితము చేయుచున్న విధమును పత్రికలయందును, సభావేదికలయందును, సంభాషణలయందును ప్రబలుచున్న వాక్కలహములు విశదము చేయుచున్నవి. శాసనసభాబహిష్కార పక్షావలంబకులకును, స్వరా[జ్య ప]క్షావలంబకులకును, యథోచితసహకార పక్షావలంబకులకును నడచుచున్న వాగ్వివాదములు జాతీయలక్ష్యము దేశభక్తి యందు లగ్నము గాక పక్షాభిమానము నందు లగ్నమైనవిధమును విశదము చేయుచున్నవి. గ్రామ సీమలందును, పట్టణములందును కుల కక్షలు, పక్షములు ప్రబలి సంక్షోభమును గలుగజేయుచున్నవి. నాయకుల యందును, అనుచరుల యందును, పక్షముల యందును, సంఘములయందును, ప్రాంతముల యందును స్వార్థము ప్రబలుచు దేశహితమంతర్ధానమగుచున్నది. దేశారాధన లక్ష్యమునందు పంతులు అయ్యంగార్లకును, కాంగ్రెసు స్వరాజ్య పక్షములకును, బ్రాహ్మణ బ్రాహ్మణేతరసంఘములకును, హిందూమహమ్మదీయ పక్షములకును, ఆంధ్రతమిళ ప్రాంతములకును భేదాభిప్రాయము లుండజాలవు. భేదాభిప్రాయములకు నిరర్థకమైన స్వప్రయోజన స్వాభిమాన పరాయణత్వము మూలముగ నున్నది.

అధిక సంఖ్యాకులైన బ్రాహ్మణేతరులు కాంగ్రెసునందుచేరి కాంగ్రెసు లక్ష్యమునుసమర్థించుట ప్రయోజనకరముగాని కాంగ్రెసును సంశయ భావముతో జూచుట ప్రయోజనకరము గాదు. జస్టిసుమంత్రివర్గము నామోదించిన గోషెను ప్రభువును సత్పురుషునిగను, స్వతంత్ర పక్ష మంత్రివర్గము నామోదించిన గోషెనుప్రభువును దుర్మార్గునిగను నిర్ణయించుట బ్రాహ్మణేతరపక్షము నావహించిన సంకుచిత లక్ష్యమునకు నిదర్శనముగ నున్నది. దేశమునందు కాంగ్రెసు ప్రతిభ క్షీణించుటకును స్వార్థపరత్వలక్ష్యమె మూల కారణముగ నున్నది. యూనియనుతాలూకా జిల్లాబోర్డులందు కక్షలు, పక్షములు ప్రబలుచు కాంగ్రెసులక్ష్యము సన్నగిలుచున్నది. శాసనసభలు వాదప్రతివాదములకు మహారంగము...

లుగ పరిణమించినవి. అసహాయోద్యమము మాటలందునవలె కార్యములందు గోచరము గాకున్నది. దార్ఢ్యరాహిత్యము, సిద్ధాంతము లందువలెను కార్యములందు ప్రత్యక్షము గాకున్నది. అసహనము, నిస్సహాయత్వము విద్వేషము సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నవి. త్యాగ మంతర్ధానమై లాభము ప్రత్యక్ష మగు చున్నది. నాయకులకును శ్రేయాభిప్రాయుల కును పంతము లేకను ప్రజాహ్లాదయమునం దలసత్వమేర్పడినది. గాంధిమహాత్ముడు తెలిపి నటులు నాయకులకును సాధనలకును పంతము గనుబడుచున్నది. ఈవిషమావస్థ నిరంకుశ ప్రభు త్వమునకు బలము నొసంగుచు స్వరాజ్యాశయ మునంతర్ధానము చేయుచున్నది. బర్కెనుహె డుప్రభువు రాయలుకమిషనుపేరు చెప్పి భారతీ యుల నాటలాడించు చున్నాడు. విచారణ సంఘమునందు సభ్యులుగ చేరుట కన్ని పక్ష ములవారును పంగలార్చుచున్నారు. ఎన్నికమి షనులు వచ్చిపోయిన తరువాత స్వరా జ్యము రాగలదో చెప్పన లేదు. వర్తమా నవిషమావస్థయందు రాయలుకమిషనుసం దేవరు నియమింపబడినను దేశమునకు గలుగ గల ప్రయోజన మత్యల్పమని ప్రాజ్ఞులు నమ్ముచు న్నారు. స్వరాజ్యసంపాదనమునకు గాంధి మహాత్ముడు నిర్ణయించిన నిర్మాణవిధానము శరణ్యమని దేశపరిస్థితులు విశదముచేయుచు న్నవి. స్వరాజ్యము ప్రత్యక్షాచరణము లేక సాధ్యముగాదని దేశపరిస్థితులు విశదము చేయు చున్నవి. కేవలము వాదప్రతివాదములతో కాలయాపనము చేయుట దురదృష్టముగ నున్న ది. ప్రత్యక్షాచరణము చీనాయందు వలె విప్లవాకారమును దాల్చవలయునో వ[illegible] మునిర్ణయించిన శాంతిస్వరూపమును [illegible] లయునో భారతీయుల సంకల్పబలము[illegible] నాధారపడియున్నది. జినబుద్ధశంకరరామ[illegible] జాదులకు నిలయమైన భరతవర్షము[illegible] శాంతిపరివర్తనము ధర్మసంస్థాపనమునకుదోడ్ప డగలదని సజీవమైన మతప్రవృత్తి విశదము చేయుచున్నది. మహాత్యాగమును చేయుటకు మహానుభావులు సమర్థులు. మహాత్యాగము నందు మమకారాభిమానముల కవకాశములు గనుపడవు. సామాన్యులకు శాంతిపరివర్త[illegible] నకు సామాన్యసాధనము. ప్రయోజనక[illegible] శాంతిపరివర్తనమునకు సర్వజనులకు ఖద్దరు సాధనము సులభసాధ్యముగనున్నది. ప్రజలు త్యాగపరాయణులై ఖద్దరుకట్టుకొనుబోని గాంధి మహాత్మునివలెను శాంతిపరివర్తనము నారా ధించి కామితార్థములను బడయుదురుగాక! భారతీయులందరును ఖద్దరునుధరించుటకుకొను బూనిన స్వరాజ్యము వెంటనే రాగలదు. గాంధి మహాత్ముడు బెంగుళూరునందు ఖద్దరుప్రదర్శన సందర్భమునందు చేసినధర్మోపదేశమును దేశ[illegible] పరాయణులందరును గ్రహించి ఖద్దరువ్యా పనమునకును, దేశసేవమునకును, ప్ర[illegible] శాంతికిని దోడ్పడిస్వరాజ్యమును శాంతిమార్గ మున సాధింతురు గాక!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T., Madras

1927

# విషయానుక్రమణిక

